# పడకటింటి ముచ్చట్లు





మా॥ శిక్ష్యవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మ ద రా సు

# పడకటింటి ముచ్చటలు



గ్రంథకర్త :

బుక్కపట్టణం తిరుమల నరసింహాచార్యులుగారు






వెల 8 అణాలు

# విజ్ఞప్తి

ప్రేమమయమగు నీవిశ్వమందు ప్రేమ ప్రవాహ మనేక విచిత్రగమనికల ననుసరించుచు దాండవించుచున్నది. అందునను స్త్రీపురుషాదులలో నొక్కొక్కరియందు నొక్కొక్క విధముగ బ్రతిబింబించుచున్నది. ఇట్టియెడ నెట్టిప్రేమ స్త్రీపురుషాదుల కాదర్శప్రాయమో, ముఖ్యావశ్యకమో, ఐహికాముష్మిక సుఖప్రదమో, నిత్యానంద ప్రదమో, ఆధ్యాత్మికవిజ్ఞాన ప్రపూరితమో యట్టి పవిత్రప్రేమోత్కృష్టతను దెల్పుటకు నాయోపిన వఱకీగ్రంథమును రచియించినాఁడ. కావున ప్రాజ్ఞులిందలి మంచిని గ్రహించి నన్ను బ్రోత్సహింప బ్రార్థితులు.

ఇట్లు

**బి. టి. నరసింహాచార్యులు**

## ప్రకటన.

ఈ గ్రంథము గవర్నమెంటువారి కాపీరైటు రిజిస్టర్డు ఆక్టు ప్రకారము రిజిస్టరుచేయబడినది. కావున దీని నితరులు ముద్రింపఁగూడదు.



ఓం

శ్రీకృష్ణసహాయము

# పడకటింటి [illegible]



## ముద్దులు




యనంతమైన ప్రకృతియంతయు నానిర్మల ప్రేమ స్వరూపునియొక్క ప్రేమామృత వర్షధారలచే సృష్టింపబడినది. ఇట్లు సృజింపబడిన యీప్రకృతియం దంతటను నాప్రేమయే యెల్లప్పుడును గోలుకాడుచుండుట మనకును బాగుగ బ్రకృతిని బరికించినచో విస్పష్టము కాగలదు. ఇట్టి యీప్రేమ భాసితమగు నీప్రకృతియం దంతటను ఆప్రేమచిహ్నములు విస్పష్టముగ గాన్పించును. ఈప్రేమచిహ్నములలో ప్రధానమైనవి ముద్దులు. ఇవి ప్రకృతిలోను మానవులయందు ననేకవిధములుగ నలరారుచున్నవి. ఆకసమునందు నతివేగముగ బఱితెంచుచు

వచ్చెడి మేఘములు మహోన్నతపర్వతశిఖరాగ్రముల నాలింగన మొనర్చుకొని, ముద్దుగొనుచున్నవి. బిరబిర వచ్చి తన్నాలింగన మొనర్చుకొను నదులను సముద్రుడు ముద్దిడుకొనుచున్నాడు. సౌరభ సంయుతమగు సుమములను దాడిగిన పుష్పలత వృక్షమును ఆలింగన మొనర్చుకొని ముద్దిడుకొనుచున్నది. ఈవిధముగ ప్రకృతియందంతటను ప్రేమచిహ్నములగు నీముద్దులు ప్రబలియున్నవి.

ఇక మానవజాతియం దీముద్దు లెట్లెట్లు వ్యాపించి యున్నవియు నీక్రింద నుదహరింతుము.

ఈయనంతవిశ్వమం దున్న మానవకోటియంతయు నట్టిప్రేమచిహ్నములగు ముద్దులయొక్క మాధుర్యమును గ్రోలియే దినదినప్రవర్ధమానులైరి. మనము మాతృగర్భము నుండి వెల్వడగానే తొలుత పవిత్రప్రేమపూరితమగు మన మాతృదేవతయొక్క ముద్దులమాధుర్యమును గ్రోలుదుము. తదుపరి తండ్రియొక్క ముద్దులను చవి జూచుచున్నాము. పిమ్మట తోబుట్టువులయొక్కయు బంధువర్గముయొక్కయు ముద్దుల యభిరుచిని గాంచుచున్నాము. పిమ్మట యౌవనము సంప్రాప్తించినవెంటనే వివాహ మాడిన భార్యయొక్క మధురయధరామృతధారాసమ్మిళితము లగు ముద్దులను గ్రోలుచున్నాము కడపట వృద్ధాప్యమునందుసైతము మనుముల మనుమరాండ్రయొక్క ముద్దులను గొనుచున్నాము. ఈవిధముగ ప్రపంచమున ముద్దులచవిని జూడని మానవులే లేరని

ఖండితముగ జెప్పవచ్చును. ఇట్టిమహోత్కృష్టములైనట్టియు, నిర్మలప్రేమరసపూరితములైనట్టియు, పవిత్రములైనట్టియు, నిశ్చలానందసంధాయకములగునట్టియు నీముద్దులు ప్రతివారిని జననము మొదలు మరణమువఱకును వెంబడించుచునే యుండుట నైజము. కావున నిట్టియమూల్యమగు ముద్దులను ప్రతివారును జవి చూచియే యున్నారు. ఇట్టిముద్దులలో నానందరసామృతమధురధారలు నిండియున్నవి. ప్రేమరసము చిప్పిలుచున్నది. ఈముద్దులు కామినీకాముకులయొక్క ధనములు. ఈముద్దులు మనోవ్యాధికి దివ్యౌషధములు. ఇవి ప్రేమచిహ్నములు ప్రేమముద్రలు జీవితోద్దీపనములు కస్తూరితేనియసోనలు మన్మథునిపూములుకులు నైహికాముష్మికసుఖప్రదములు నై యున్నవి. ఇవి ముద్దులలో నున్న సుగుణములు. ముద్దులలోనే కొన్నిప్రాణాపాయకరములైన దుర్గుణములు నున్నవి. కాని యట్టివి వేఱుతరగతికి జెందినవి. ఒకవిధ మగు ముద్దు ప్రాణమును దీయును. ఇంకొక ముద్దు యంటువ్యాధులను వ్యాపింపజేయును. వేఱొక ముద్దు క్రూరత్వమును జూపును. మఱియొక ముద్దు కపటమును, విషమును వెలిగ్రక్కుచుండును. ఇట్లు అనేకవిధములుగ నీమానవప్రపంచమున ముద్దులు వ్యాప్తి నంది యున్నవి. నోరులేని పశుపక్ష్యాదులు గూడ నీముద్దులయభిరుచిని కనుగొనియున్నవి. ఆవు తనలేగదూడను తననాలుకతో నాకుచు ముద్దిడుచున్నది. పక్షులు తమపిల్లలకు దమముక్కులతో నాహారమును దెచ్చి యిడుచున్నవి.

పూర్వము నాగరకత లేనికాలములో గూడ ఫ్యూజియన్ తెగకు జెందిన స్త్రీలు తమపిల్లల కాహారపదార్థముల నిడు నపుడు తమనోటితోనే వారికి పెట్టు నాచార ముండెడిదట. అట్లుగాక నాయాహారమును తమచేతులతోడగాని లేక యొక గిన్నెలోగాని వేసి పెట్టినయెడల నాపసిబిడ్డ లేమాత్ర మట్టి యాహారమును ముట్టకయుందురట. ఆపిల్లలు దప్పిగొన్నప్పుడు తల్లులు నొకపొడుగైన గొట్టముద్వారా బాగుగ జలమును నోటినిండ బీల్చుకొని యానీటినే పిల్లలనోళ్లలోనికి బోసెదరు. లేనిచో పిల్లలకు దప్పియే తీఱక యూరక నేడ్చుచుండెడి వారట. ఈవిధముగ దొలుత ముద్దులు కనిపెట్టబడినవి. వీనికే తల్లులముద్దు లని పేరు.

ఇక పూర్వకాలపు జ్యూన్ తెగవారలలో నీముద్దులు మామూలుగా వ్యాప్తి నందియున్నవి. కొలదిపరిచయము గలవారుగూడ నొండొరులు కలిసికొనినవు డొకరి నొకరు ఆశీర్వచనసూచకముగను, వందనపూర్వకముగను హస్త మునో, శిరస్సునో, భుజమునో ముద్దిడుకొను నలవాటు ఉండె డిది. వారు గొప్పవారికి యమితగౌరవము జూపవలసివచ్చినచో నప్పుడు వారాగొప్పవారియొక్క పాదములనుగాని, లేక వారు నడచినయడుగుజాడలనుగాని ముద్దిడుకొనువాడుక గలదు. తరు వాత యేసుక్రీస్తుకాలమున నీముద్దు లోకమర్యాదసూచక ములు మాత్రమేగాక ప్రేమచిహ్నములుగగూడ బరిగణింప బడ జొచ్చినవి.

తరువాత యూజ్యాస్ తెగవారినుండి ముద్దులు క్రైస్తవ దేవళముల కెగఁబ్రాకినవి. ప్రథమక్రైస్తవమతస్థు డీముద్దులను సోదరసోదరీవాత్సల్యమును దెల్పునట్టివిగ సంభావించెను. తదుపరి యీముద్దులు గొప్పగొప్ప సమావేశములలోని కెగబ్రాకెను. ఏదేని యొకగొప్పసమావేశము జరుగునపు డందలి సభ్యు లొకరి నొకరు ముద్దిడుకొనుచుందురు. అందలి యర్థము, తమలో నేలాటి విరోధములు లేక తామందఱును శాంతియుతముగను నైక్యభావము గలిగియుండవలెననుట. ప్రస్తుతము గ్రీకుదేశములోని క్యాథలిక్కు దేవళములందు ఈస్టరు అను పండుగనాడు నొకరి నొకరు ముద్దిడుకొనుట యాచారము. ఆపండుగనాడు వీరందఱు కలిసికొని యొకరినొకరు గౌరవభావసూచకముగను, విశ్వాససూచకముగను, దైవసాక్షాత్కారసూచకముగను ముద్దు లిడికొనియెదరు. రోమనుకాథలిక్కు దేవళమునందలి బిషప్పులు ధరించిన యుంగరములను ప్రజలు ముద్దులిడుకొనియెదరు. అయ్యవి యాతనిని పెద్దగా నెంచి పూజించున ట్లర్థ మిచ్చెడివి. ఇక నా దేశాధికారి యగు పోపును క్రొత్తగా నెన్నుకొనినపు డాతనియనుచరు లాతని పాదరక్షలను తమమోకాళ్లపై గూర్చుండి ముద్దిడుకొనుచుందురు. అప్పు డాపోపు, వారిని లేవనెత్తి యొక్కొక్కరిని రెండు చెక్కిళ్ల మీదను ముద్దిడుకొనుచుండునట. అట్టివి యాశీర్వచనపూర్వకము లగునవి.

కాని పూర్వకాలమున రోమ్యులనుపరిపాలనకాలమందు రోమీయులలో బురుషులు తమస్త్రీల నెల్లప్పుడు

సందేహించుచు, నప్పుడు మద్యపానము తమలో విశేషముగా నుండుటచే నట్లు తమ స్త్రీలుగూడ మద్యమును సేవించిరేమో యని కనుగొని దండించుటకై ముద్దుపెట్టికొనెడివారట. ఏలనన నామద్యపానపుహక్కు అప్పుడు పురుషులకేగాని స్త్రీలకు నిషేధము.

ఇక ప్రాచీనగ్రీసుదేశము నొకింత పరికింతము. ఈదేశములో మఱియొక వింతయాచారము గలదు. పూర్వ మా దేశమునందు పురుషులలో నెవరైన యొకస్త్రీని బహిరంగముగ ముద్దిడినచో నట్టివారికి మరణదండనము విధింపబడు నను. రాజశాసన ముండియుండెడిది ఆదేశమందొకానొకప్పుడు ఒక ఎథినియన్ యువకుడు దుష్టుడగు పిసిస్ట్రటస్ యనునాతని కొమార్తెను ప్రేమించి యట్టిప్రేమాతిశయముచే నామెను వీధిలో ముద్దిడుకొనియెను. కాని యాత డట్టిదుర్మార్గుడైనను నీసందర్భమునందుమాత్రము చాల శాంతస్వభావమును గలిగి యుండెను. కాని యాతనిభార్యమాత్రము తనకొమార్తె నాయువకు డట్లు బహిరంగముగ ముద్దిడినందులకు మరణశిక్ష విధింపవలెనని యతనిని గోరగా నప్పు డాత డామెతో "మనలను ప్రేమించినవారిని శిక్షించినచో నిక మనలను ద్వేషించువారి నేమిచేయుదము?" అని ప్రశ్నించెను. అంతటితో నామె మనస్సుగూడ ద్రవీభూత మాయెను.

రోమనుచట్టము బహిరంగముగ ముద్దుల పెట్టుకొనుట యాచారవిరుద్ధముగ నెంచి నిషేధించెను. ఈసందర్భమున

గొన్ని యుదాహరణములుగూడ గలవు. ఒకవివాహిత యగు స్త్రీ తనభర్తచేతగాక యితరులచేత ముద్దిడబడిన నట్టిస్త్రీ తన యొక్క స్త్రీధనమునంతను గోల్పోవవలసిన దాయెను. ఒకస్త్రీ యొకపురుషుని వివాహమాడుటకు నిర్దేశింపబడియెను. కాని యాతడు రోగబాధితుడై మరణించునపుడు తన్ను వివాహ మాడుటకు నిర్దేశింపబడిన యాస్త్రీని ముగ్గురియెదుట ముద్దిడి కొనియెను. అప్పటినుండి యాపె యతనికి ధర్మపత్నిగా నెంచ బడి యతనియాస్తి యంతయు నాపెకే సంక్రమించెను. ఇప్పటికిగూడ చాలదేశములలో వివాహ్యనిర్దిష్టులగువా రొకరి నొకరు ముద్దిడుకొనినచో నప్పటినుండి వారిరువురు చట్టము ప్రకారము దంపతు లగుదురు.

పిమ్మట కొంతకాలమునకు రోముదేశమున నక్రమ ప్రభుత్వవిధాన మేర్పడి, క్రమక్రమముగా నీముద్దులకు గల కట్టడులు వీడి చౌకయైపోయినవి. అప్పుడు లస్టన్ అనునాతడు వరుసగ బరిపాలనము చేసిన పండ్రెండుగురిచక్రవర్తుల స్వీయ చరిత్రములను వ్రాయుచు నాకాలమం దుండు ముద్దులవెఱ్ఱిని చక్కగ వర్ణించియున్నాడు. ఒకగొప్పవిందు జరుగునపుడు, నట్టివిందుల కాహ్వానింపబడిన యతిథు లందఱును విదారగింప బోవుటకుముందు వడ్డనల జేయు పడుచుల నందఱిని ముద్దులు పెట్టుకొనవలసిన యాచారము ప్రబలముగ నుండినదట.

హోమరుకాలమునాడు, నుదారస్వభావుడగు ఓడీసి యుస్ యొక్క సేవకులంద ఱతనిని శిరోభాగముపైనను, భుజ

ములపైనను, చేతులను ముద్దు లిడుచుండువారట. ఈవిధముగ నొనర్చినచో నయ్యది యెంతయో మర్యాదసూచకముగ నాకాలమున భావింపబడుచుండెడిదట. ఇట్లు అప్పుడు రోము దేశములో ముద్దులు వ్యాపించియుండినవి.

కానియీముద్దులను ప్రాచీనులగు ట్యూటనులు, ప్రత్యేకముగా ప్రేమసూచకముగునట్టియు, స్నేహవాత్సల్యమును గన్పఱచునట్టియు వానినిగ భావించిరి. ఇప్పటి ఆంగ్లోసాక్సన్ తెగవారిలోవలెనే యప్పటి వారిలోగూడ నొకరిహస్తము లొకరు పట్టుకొని గట్టిగా కులికించుట నొకమర్యాదసూచకచిహ్నముగ భావింపబడుచుండెడిది. తరువాత రాను రాను మధ్యకాలములో నీముద్దులలో ననేకయాచారములు పరిణమించినవి. రైతు తన భూస్వామిని గౌరవించునపుడు దాతడతనిచేత ధరించిన ఖడ్గమును ముద్దుగొనవలెనట. న్యాయస్థానమునందుగూడ నచ్చటి మతగ్రంథమును ముద్దుపెట్టుకొనవలసియుండును. ఈవిధానము మాత్ర మిప్పటికిని ఇంగ్లాండు దేశమందును, అమెరికా దేశమందును నచ్చటచ్చట కొన్నికొన్ని న్యాయస్థానములలో నాటపబడుచున్నది.

అస్ట్రియాలో గౌరవనీయకుటుంబమునకు జెందినవారు సాధారణముగా స్త్రీలను ముద్దిడవలసినయాచారము గలదట. స్పెయినుదేశమందు పురుషులు స్త్రీని జూచినచో "నీచేతికి ముద్దు" అని చెప్పి, యామాటతోనే ముద్దుపెట్టినట్లుగ భావించి, దానితోనే సంతృప్తి నందవలెనట. ఇటలీదేశమందు నొకరి

నొకరు ముద్దిడుకొన్నచో నట్టిది వారిరువురియొక్క యత్యున్నతమగు స్నేహవాత్సల్యమును దెలుపునట. రష్యాదేశములో జేతులను ముద్దుపెట్టుకొనుట యననేమియో వారికి దెలియనే తెలియదట. కాని సద్భావసూచకముగ మాత్రము నొకరిముఖముపై నొకరు ముద్దులిడుకొను వాడుక గలదట. రష్యాస్త్రీలు తమయింటికి వచ్చు నతిథులలో నొకరికి నితరులకంటె నధిక గౌరవము చేయవలయు ననుసంకల్ప ముదయించినచో వెంటనే యావచ్చినట్టి యతిథి గదిలోనికి ప్రవేశింపబోవుచున్నప్పుడతనియొక్క ముఖోపరిభాగమును ముద్దిడుకొని, పిమ్మట యాతని కొకగిన్నెడు సారాయిని యందిచ్చునట. రష్యన్ రైతు తనభూమిఖామందు తనవద్ద కేతెంచినపుడు వందనపూర్వకముగా నాతని మోకాళ్లను రెండిటిని గట్టిగ కౌగలించుకొని ముద్దిడుకొనునట.

ఇక అమెరికాలోని ముద్దులన్నియు ప్రేమ, గౌరవము, ప్రార్థనము మొదలైనవానిని దెలియజేయును. ఆదేశమునందు విశేషముగా వసంతఋతువులు, వెన్నెలరాత్రులు మొదలైన సమయములన్నియు యువతీయువకులయొక్క ముద్దులతో నిండిపోవును. ఈయువతీయువకు లొకరినొకరు గాఢముగ ముద్దులిడుకొనుచు; తమలో గల ప్రేమోత్కృష్టతను ఆముద్దుల ద్వారా దెలియజేసికొని, పరవశులై, తుదకు నొకరినొకరు వివాహము గావించుకొనియెదరు:—

ఇట్లొకరినొకరు ముద్దిడుకొనుటలో గల యాయువతీ యువకులయొక్క ప్రేమాతిశయమును, నైక్యభావమును, ప్రాచీనాంగ్ల సుప్రసిద్ధకవి యగు బైరన్ గారొకానొక సందర్భమునం దిట్లు దెల్పిరి.

"Long, long kiss, and the kiss of youth and love"

కావున నిట్టి ప్రేమభాసితములగు ముద్దులయొక్క ప్రభావమింతింత యని వర్ణింప నలవికాదు. అందునను యువతీ యువకులయొక్క ముద్దులలో నపారమైన నిగూఢగుప్తభావ పరంపరలు నిండి నిబిడీకృతమై యున్నవి. వారిరువురు నొకరి నొకరు ముద్దిడుకొనునపు డీప్రపంచమును మఱచి స్వర్గలోక సౌఖ్యమును జూఱగొనుచుందురు. పారవశ్యముచేత చైతన్య ముడిగి, యిద్దరు గట్టిగ గౌగలించుకొని కన్నులు మూసికొని, యిరువురియధరములను జేర్చి, యేకరూపమైనట్లుగ నారీతిగ జాలసేపటివఱ కొకరినొకరు వీడకయుందురు. అట్లు వారు ముద్దిడుకొనునపు డెవరైన బలాత్కారముగ విడదీసినచో నప్పుడు వారికెక్కడలేని యాగ్రహ ముదయించి, పైపెచ్చు ఆవిడదీసివారిని చిత్రవధ గావింప నుంకింతురు. అట్టిసమయమున వారిరువురును గలిసి యొకరి నొకరట్లు ముద్దిడుచు కొనుచునే యెంతటికష్టవార్ధినైనను, ఎంతటి మహాఘోర విపత్తునైనను, మఱియెట్టిమరణమునైనను అనాయాసముగ ననుభవింపగలుగు చిత్తస్థైర్యమును గలిగియుందురు. అట్టివారి ముద్దుల విలువ వర్ణింప నలవికాదు. వారికి సర్వదా యీము

ద్దుటే సరసాలాపములు. ఆముద్దులే వారి మధురగీతాలాపములు. ఆముద్దులే నిర్భరానందవీచికాసందోహములు. ఆముద్దులే వారి కిహపరసౌఖ్యసాధనములు. ఆముద్దులే వారిజీవితపరమార్థములు. అట్టియువతీయువకులయొక్క ముద్దులలో తేనెకంటెను, కండశర్కరకంటెను, అమృతముకంటెను మాధుర్యము అధికముగ నున్నది. ఆముద్దులలో సాయుజ్యసాలోక్యసారూప్యాది వేదాంతసార మిమిడియున్నది అట్టి ముద్దు లతిపవిత్రములు, దంపతుల కందఱికి నాదర్శప్రాయములు నై యొప్పియుండును. అట్టిముద్దుల యందు పవిత్రప్రేమప్రభావ మిమిడి యున్నది.



# ముద్దులమాధుర్యమును గ్రోలనిశిశువులు

---

మేము వెనుకటిప్రకరణములో నుదహరించినట్లు సాధారణముగ నీప్రపంచములో నుండు ప్రతివారును ముద్దుల యొక్క మాధుర్యమును గ్రోలి, తదనుభవసారమును బొంది యే యుందురు. కాని యొకవేళ దురదృష్టవశముచేత గొందఱియొక్క తల్లిదండ్రులు వారు జన్మించినతోడనే చని పోయియుందురు; అప్పు డట్టివారికి యాతలిదండ్రులయొక్క ముద్దులు కఱవై పోవును. అప్పుడు వారు దిక్కుమాలిన వత్సలు వోలె గొట్టిమిట్టాడుచు నెవరిపంచనో పెనుపబడుదురు. అట్టి శిశువులు సర్వసాధారణముగ జీవించియుండుటయే బహు కష్టము. ఏలయన, నట్టిశిశువుం కు దమనిర్మలప్రేమామృతధార లను బ్రతిదినమును గాఢమగు ముద్దులద్వారా ద్రాగింప జేయునట్టి తల్లిదండ్రులు విదూరులగుదురు. ఆశిశువులమీద తల్లిదండ్రుల కున్నంత ప్రేమాదరణములు పెంచెడివారికి సాధారణముగ నుండజాలవు. తల్లి తాను నవమాసములు మోసి యష్టకష్టముల కోర్చి, తుదకు దనశరీరములో నుండు రక్త మాంసములే తనప్రేమసమ్మిళితములై, వెలుపలికి శిశు రూపముగ వచ్చుటచే నట్టిశిశువులు తన శరీరసంబంధలి భాగ

స్థులు గనుక, తనశరీరమును బోషించుకొనునట్లే వారినిగూడ
నధికారమమకారములతో, స్వచ్ఛమగు ప్రేమతో ప్రతిదినమును
పోషించుచు ముద్దులిడుకొనుచుందురు. అట్లు తమతల్లులచే
ముద్దులిడబడిన బిడ్డలందఱు వారికి దెలియని యనంతమగు
నవ్యక్తానందముతో దేహము లుప్పొంగి, రక్తప్రసారముగూడ
చక్కబడి, మంచి దేహపటిమను, సౌందర్యమును, నుత్తేజమును,
నవయవసౌష్టవమును గలిగి యుల్లాసముద్దుగ దినదినప్రవర్థ
మానులగుదురు. అట్టివారి కేవిధమైన మనోవ్యాకులముగాని
లేక, సర్వదా నిత్యానందముతో దులదూగుచుందురు. వారు
పెరిగినకొలదిని విచార మనున దేమియో యెఱుగక, తమ
పసితనమునుండియు తమతల్లిదండ్రులయొక్క పవిత్రములైన
ముద్దులద్వారా నేర్పబడిన మహోత్కృష్టప్రేమరహస్యమును
బాగుగ గుర్తింపగలుగుదురు. అట్టివారు పెద్దవారై, తమలో
మానవలోకము నంతటిని యేవిధముగ ప్రేమింపవలయునో
యావిధముగ ప్రేమింప గలుగుదురు. వారిదృష్టికి యీసృష్టి
యంతయును ప్రేమమయముగనే తోచును. ఈసృష్టిలో నున్న
సకలచరాచరజంతుజాలమును వారు ప్రేమింపగలుగుదురు.
ఏవస్తువునుగాని వారు ద్వేషింపజాలరు. ఎప్పుడైతే వారికి
యేవస్తువునందు నీషణ్మాత్రమైనను ద్వేషభావము లేక ప్రతి
దానియందును నిర్మలప్రేమభావము ప్రపూర్ణమై యుండునో
యప్పటినుండియు, వారిలో కామక్రోధలోభమోహమద
మాత్సర్యాదు లను నరిషడ్వర్గములకు దావొసంగబడదు.

వానిని తమప్రేమోన్నతిచేతనే జయింపగలుగుదురు. అట్టి ప్రేమను గలిగినవారికి యీవిశాలప్రపంచ మంతయు ప్రేమమయములే గనుక నట్టివా రిట్టిప్రేమమయమగు జగత్తు నంతటిని వాంఛించుచు సర్వదా లోకారాధన గావింపగడంగుదురు. వారు ప్రత్యేకముగ గామించు వస్తు వేదియు నుండజాలదు. అట్టిచో వారిహృదయములం దింక కామమునకు దావుండదు. అన్నిటికి మూలమగు నీకామమున కెప్పుడు వారి హృదయములలో స్థాన ముండదో యప్పటినుండియు తక్కిన దుర్గుణములు గూడ వారిహృదయములం దుత్పత్తి కాజాలవు. ఇట్టియుత్కృష్టమైన ప్రేమోన్నతిని వారు గలిగియుండుటచే నాప్రేమస్వరూపు డగు భగవంతుని సారూప్యము కూడ వారి కచిరకాలములోనే సిద్ధింపగలదు. ఇట్టిమహత్తరమైన పవిత్ర ప్రేమప్రభావోద్దీపితములగు మాతాపితరులయొక్క ముద్దులను బ్రతివారును అనుభవింపవలయును.

అట్టి ముద్దుల ననుభవించుటకు తమపూర్వజన్మ దుష్కృత ఫలితముగ జిన్ననాడే తల్లిదండ్రులను గోల్పోయినవారి జీవనము బహుదుఃఖభాజనమును, దుర్భరము నై యుండును. తల్లిదండ్రులు లేని పిల్లల కాముద్దులభాగ్యము విదూర మగుటచే వారికి పిన్ననాటనుండియు మనోవ్యాకులము జనించును. అట్టిమనోవ్యాధికి మందు లేకపోవుటచే నది నానాటికి పెచ్చు పెరిగిపోయి వారికి హృదయదౌర్బల్యము సంఘటిల్లజేయును. ఆవిచారభరముచే క్రమతః సర్వాంగకములు కృశియించి

పోవును. తద్ద్వారా వారిశరీరములుగూడ నానాటికి దుర్బలము
లై పోవును. ఈవిధముగ మాతృచుంబనవిదూరులగు శిశువు
లకు మనోదార్బల్యము శరీరదార్బల్యముగూడ సంఘటిల్లి,
తుదకు నకాలమరణములవాత బడుదురు. అట్లుగాక యొకవేళ
వారు సజీవులై యుండగలిగినచో నట్టివారు పెద్దవారై నపుడు
మిక్కిలి దుర్బలులుగను, రోగగ్రస్తులుగను దయారుకాగలరు.
అట్టివారికి పవిత్రప్రేమయొక్క పూజ్యభావము గోచరింపక
పోవుటచే నట్టిప్రేమ కిరణములగు శాంతిశమదమాది సద్గుణ
ములుగూడ విహీనములై, వానికిబదులు దుర్గుణము లెక్కు
వగ ప్రబలిపోవును. అట్టివారి భావిజీవిత మెంతయు బహుదుఃఖ
భాజక మైపోవును. కావున తల్లిదండ్రులు లేనిబిడ్డలను బెంచు
టలో నట్లు పెంచెడివారు పడు కష్టము లిన్నియన్ని కావు. ఆ
దిక్కుమాలిన శిశువులకు, వారితల్లిదండ్రులు గతించినందువలన
గలిగిన మనోవ్యాకులమును సంపూర్ణముగ మఱపింపజేయు
టకు యత్నింపవలయును. తల్లి పోయినక్రొత్తలో పసిపిల్ల లితర
పిల్లలతో జేరక, పాలొసంగిన త్రాగక, నొంటరిగా నుండి
యూరక బిక్కమొగమును వైచుకొని యుందురు. ఎవరైన
వారిని సమీపించి, వారి నెత్తికొన బ్రయత్నించునపుడు వా
రూరక నేడ్చుచుందురు. ఆటవస్తువులయందు సహజముగ శిశు
వుల కుండు చాపల్యము వారిలో మందముగ నుండును. సర్వ
దా వారు దేనినో తలంచుకొని యూరక కుమిలికుమిలి యే
డ్వసాగుదురు. వారిముఖములం దెల్లపుడును విచారరేఖలే తో

చుచు కళావిహీనములై యుందురు. తమచనిపోయిన తల్లుల మొగము లెచటనైన గాన్పించునేమో యని యూరక ప్రతి వంకను బిక్కమొగము వైచుకొని యాతురతను దెలుప జేయు చూపులను బఱపుచుందురు. అట్టి దిక్కుమాలినవారిని బెంచువారు వారిమనోవ్యాకులమును బాపుటకు ప్రప్రథమ మున ప్రయత్నింపవలయును. వారి నెప్పుడును నొంటిపాటున నుండనీయరాదు. వారి కనేకవిధములగు నానందకరదృశ్యము లను జూపింపవలయును. తోటిశిశువులను దీసికొనివచ్చి వారి యెదుట గూర్చుండబెట్టి వారితో నాటలాడునట్లు చేయుచుం డవలయును. వారియెదుట నితరపిల్లల నూరక ముద్దు లిడుకొ నుచు వారికి పాలనుగాని లేక తదితర తినుబండారములనుగాని పెట్టుచుండవలయును. ఇట్టిదృశ్యములను గాంచినంతనే వారికి గూడ క్రమముగ మనోవ్యాకులము నశించి, యితరపిల్లలను వలె దమ్ముగూడ ముద్దులాడవలయుననియు, వారికివలెనే తమకు గూడ నేదేని తినుబండారములను, ఆహారమును బెట్టుచుండ వలయుననియు గోరుదురు. అప్పుడు వారిని బెంచువారు చం కలో నిడుకొని యాడించుచు నేదైనీయక నూరక ముద్దులాడు చుండవలయును. ఇట్లు చేసినచో వారు చనిపోయిన తలి దండ్రులను కొంతకాలమునకు మఱతురు. అప్పుడు వారిమనో వ్యాకుల మంతరించును. సంతోషము మొలకలెత్తును. తమ్ము పెంచుచు ముద్దులాడు చుండువారినే తమతల్లులనుగ భావిం చుచు వారిపై నెక్కువప్రీతి గలవా రగుదురు. తమ్ము న

ద్దుల పెట్టుకొనునవు డట్టిముద్దుల ప్రభావమువలన మంచి యారోగ్యవంతులై, ఆనందముతో మంచిశరీరసౌష్టవము గలిగి వర్ధిల్ల గలరు. ఇట్టి ప్రభావము గల ముద్దులయొక్క యాత్మ్య ప్త్యమును బాగుగ గమనించి తలిదండ్రులు తమబిడ్డలను, జా గ్రత్తగ బెంచుచు వచ్చినయెడల వారు పెరిగి పెద్దవారైన పుడు చక్కని దేహసౌష్టవమును గలిగి ప్రేమప్రభావమును జ క్కగ గుర్తెఱింగి తమభార్యాబిడ్డలకుగూడ నట్టిప్రేమోత్కృ ష్టతను దెలియబఱచి తమయెడల వారికిగూడ ప్రేమానురా గములు, భక్తిగౌరవములు గలిగియుందురు. ఈవిధముగ మాతృప్రేమపూరితచుంబనములుచే ప్రవర్ధమానులైనవారి హృదయములుగూడ ప్రేమపూరితములై వారిసంసారజీవితము గూడ సౌఖ్యప్రదమై ముద్దు లొలుకుచునుండగలదు.



# తొలిముద్దు

సాధారణముగ ముద్దుపెట్టుకొనుట యన బ్రతివారికిని దెలిసినవిషయమే. ప్రతివారును ముద్దుపెట్టుకొనుటలో బ్రత్యేకవిధానముల నవలంబించుచు దక్కినవారికంటె తమయొక్కవిధానమే యుత్కృష్టమైనదని భావించుచున్నారు. కొందఱు వట్టరానితమకముచే తాము వరించిన యువతిని బిగ్గ కౌగలించుకొని యూపి రాడకుండ గట్టిగ ముద్దిడుకొనుచుందురు. కొందఱు పశుతుల్య వాంఛాప్రాబల్యముచే యువతుల నఖశిఖపర్యంతరము ముద్దులవర్షమును గురిపింతురు. కొందఱు తాము ప్రేమించిన యువతులును వారియొక్క తలిదండ్రులును తమ్ము నిరాకరించినచో దగినయదను లభించువఱకు వేచియుండి, యట్టితరుణము దొరకినపుడు వారికి దెలియకుండగనే వారు తమ్ము సమీపించువఱకును జాటున బొంచియుండి యొక్కసారి బలాత్కారముగ వారిని బట్టుకొని ముద్దుపెట్టికొనియెదరు. కొందఱు కల్లిబొల్లిమాట లాడి, స్వార్థపరులై, తాము వలచినయువతులచే దమకార్యమును సఫలీకృత మొనర్చుకొనుటకు వారిని తాము నిజముగ బ్రేమించుచున్నట్లుగ బ్రవర్తించుచు దొంగముద్దుల నిడికొనియెదరు. కొందఱు అత్యంతకామతృష్ణార్తులై, యువతులయొక్క నోటిలో నోటిని బెట్టి యెంగిలిజేసెదరు. కొందఱు తాము వలచిన

యువతులను వివాహ మాడుటకు తమతల్లిదండ్రు లనుమతి
యొసంగ కున్నను, లేక యాయువతులయొక్క తలిదండ్రులు
నిరాకరించినను వారిరువు రన్యోన్యముగ ప్రేమించి యేనిగూ
ఢమగు స్థలమునందో రహస్యముగ సమావేశమై, తమ్మెవ్వ
రైన జూతురను భయముతో ముద్దు లిడికొనియెదరు. కొంద
ఱు తాము వివాహమాడినట్టి యువతుల ననుమానించినపుడు
వారిని శిక్షింపవలె నను నుద్దేశముతో గాని లేక హత్యజేయు
నుద్దేశముతోగాని తామాయువతులను ముద్దిడుకొనునపుడు
వారియొక్క యధరములను దమయొక్క పంటికొనతో గట్టిగ
గఱచి గాయపఱచి రక్తము స్రవించునట్లుగ నొనర్తురు. ఈరీ
తిగ ననేకులు అనేకవిధములుగ నీముద్దులను ప్రయోగించు
చున్నారు. కాని యీపై జెప్పబడిన ముద్దులవిధానము లన్ని
యు సమానుషములును ఘోరములు నై యట్టి స్త్రీపురు
షుల యారోగ్యమును సమూలముగ నశింపజేసి వారియం
దనేక ప్రబలరోగములను గలిగించుటయేగాక పై పెచ్చు
వారిని ఘోరమృత్యుగహ్వరమున కీడ్చుకొని పోవును. కా
వున యిట్టిముద్దులయొక్క యనర్థములను బాగుగ స్త్రీపురుషు
లు గుర్తెఱింగి యావిధముగ బ్రవర్తింపకుండ నుండవల
యును. స్త్రీలుగాని పురుషులుగాని యొండొరులు ముద్దులు
పెట్టుకొనునపు డాముద్దుల విధమును బాగుగ బరిశీలించినచో
వారివారిమనోభావములు దర్పణములలోవలె స్పష్టముగ గో
చరింపగలవు. ఒకయువకు డొకయువతిని తాను త్రికరణ

శుద్ధిగ ప్రేమించుచున్నచో నట్టి తన ప్రేమోత్కృష్టత నాపెకు మున్ముందు దెలుపవలసియుండును. అట్టిచో నాత డాపెపై దనకున్న ప్రేమభావములను అవకాశము చిక్కినపు డొకేసారి "నిన్ను నేను ప్రేమించుచున్నాను. నీవే నాకు ప్రాణము లోకము. నీకొఱకు నేను ప్రాణత్యాగమునైన నొనర్తును" అని సర్వసాధారణముగ నిప్పటియాంగ్లేయ భాషయందును, యాంధ్రభాషయందును గల కొన్నినవలలో నున్నరీతి గను సినిమాలలోని నాయికానాయకుల వలెను నూఱక వెళ్ల గ్రక్కగూడదు. అట్టితొందరపాటువలన నాయువతి యతనిని యున్మాదునిగను కామోద్రేకవశునిగను దలంచుట స్పష్టము. తాను ప్రేమించిన యువతి కెన్నడును తానుమాత్రము తన యొక్క ప్రేమను స్పష్టముగ విప్పిచెప్పరాదు. తాను చెప్పకయే తనసత్ప్రవర్తనలవలనను, తననిర్మలమైన ప్రేమాంబుపూరిత లోచనములవలనను, మృదుమధుర సంభాషణములవలనను నిరాడంబర జీవనమువలనను, పరోపకార పరాయణత్వమువల నను నాపెయే గ్రహింప గలుగునట్లుగ నొనర్పవలయును. తానాపెను ప్రేమించుచున్నట్లుగనే యాపెగూడ తన్ను ప్రేమించునట్లుగ నొనర్పగలుగు సత్ప్రవర్తన లన్నియు యువకుడు గలిగియుండవలయును. తొలుత వారిరువురి ప్రథమ సమావేశమపుడు, నాపెముఖము నొక్కసారి చూచి, పిదప దననేత్రములను వెంటనే మరల్పవలయును. యువకుడు తనచూపు, నాయువతి తన్ను చూచునపు డాపె

చూపుతో లయింపజేయువలయును. అదియైన యొక్క క్షణకాలమే. ఆలిప్తకాలములోను అతనిచూపులం దతని యొక్క పవిత్రప్రేమభావములన్నియు గన్పఱపవలయును. అట్టి తఱి యాతడు తెప్ప లార్చుటగాని, కనుపాపల నటునిటు గదల్చుటగాని యొనర్పరాదు. అప్పు డేమాత్రము భీతిని గలిగి యుండరాదు. వేగిరపాటు కన్పఱపరాదు. ఆచూపులందు ప్రశాంతమును తాండవింపజేయవలయును. ఆచూపులలో నేవిధమైన భావోద్వేగమునుగాని కన్పఱపరాదు. మామూలుగా నొకసుందరమగు పదార్థమునుగాని, పుష్పమునుగాని యెట్లు తాను వీక్షించునో యట్లే యాపెముఖమును జూచునపుడు గూడ నట్టినిశ్చలమైన దృక్కులనే గలిగియుండవలయును. అట్టి సమయమున నాయువతి తిన్నగ గుటించి, యనుమానపడునేమో యనియు, తన్నేమిగా దలంచునో యనియు నేవిధమైన యనుమానముగాని భయముగాని పొందకుండవలయును. అట్టిక్షణమందు వారిచూపులు "ప్రపంచమంతటిని మేము జయింపగలుగుదుము" అనుభావమును దోపజేయునట్టివిగా నుండవలయును. ముఖమును చిట్లించుటగాని, లేక విప్పుటగాని, క్రేగంటిచూపులనుగాని, కోఱచూపులనుగాని ప్రసరింపరాదు. వేయేల, ఆక్షణనం దత డతిప్రశాంతమూర్తియై యుండవలయును. కాని యిట్టు లొక్కక్షణముకంటె నెక్కువకాలము తనచూపులా పెచూపులయం దుంచరాదు. ఆక్షణములోనే యాయువతికి తనచూపులయందలి నైర్మల్య మంతటిని ప్రతిబింబింపజేయ

వలయును. ఆచూపులలో నేలాటికృత్రిమముగాని గన్పట్టరాదు. ఇట్లు చూచుచు నాయువతియొక్క వీక్షణమాలికల లోని భావములనుగూడ గ్రహింపవలయును. ఆపెచూపులు గూడ తనచూపులవలె నిశ్చలములై, నిర్మలభావపూరితములై యుండినవని తనకు దోచినచో నట్టియువతి తనకు వివాహయోగ్య యని భావించుకొనవలయును. కాని మరలమరల యాపె ననేకసారులు చూడగూడదు. ఈవిధముగ నిప్పటియువకులు తమతల్లిదండ్రులచేత దమకు వివాహమునకు నిర్దేశింపబడినట్టిగాని లేక తమ్ము వివాహమాడుట కిచ్చగించునట్టిగాని యువతులనుమాత్రమే చూడవలయును. అంతియేగాని ప్రతివారిని యట్లు చూడకూడదు. తనకు కాబోవునట్టి భార్యపై బఱపినట్టి చూపులనే యితరయువతులపై బఱపినచో నట్టి చూపులు కృత్రిమములుగాని వేఱు గావు. ఈపై జెప్పబడిన యంశము లన్నియు వివాహ మాడబోవు యువతీయువకుల కొఱకే యుద్దేశింపబడినవి.

ఈవిధముగ నా యువతీ యువకుల ప్రథమసమావేశము ముగియవలయును. అటుపైని కొలదిదినములతర్వాత నప్పుడప్పు డాపెను పరీక్షించుచుండవలయును. ఇటు లిరువురికిని కొంతకాలము పరిచయము గలిగినతరువాత తమతల్లిదండ్రులకు తాము వివాహమాడబోవు యువతులయొక్క గుణమును శీలమును వివరించి చెప్పి తా మాయువతులను ప్రేమించితిమనియు, నా యువతులను వివాహమాడుట కనుమతి యొసంగవలసిన

దనియు గౌరవించియును. మఱియు నా యువతియొక్క తలిదండ్రుల
యనుమతినిగూడ దీసికొనవలయును. ఇట్లు నిరువురును దమ తల్లి
దండ్రుల యనుమతిని బడసినపిమ్మట వారిరువు రొండొరుల
యొక్క యనురాగాతిశయమును బరీక్షించుటకు గడపవల
యును. అట్లని, ప్రప్రథమమున యువకు డొకేసారి తన్నువివాహ
మాడబోవు యువతితో తనప్రేమోత్కృష్టతనుగూర్చి
యొక పెద్ద గంభీరోపన్యాసమునకుగాని, సంభాషణములకు
గాని కడంగరాదు. ఇప్పటియువకులు సర్వసాధారణముగ
దాము వలచిన యువతులతో వారిపై దమ కుండు ప్రేమనంత
టిని తమమృదుమధురవాక్కులచేతను, గంభీరోపన్యాసముల
చేతను వెలిగ్రక్క నుంకించుచుందురు. అది యెన్నటికిని సరి
యైనమార్గము కాజాలదు. అట్టివిధానమువలన నాయువతు
లను తాత్కాలికముగ దమ్ము ప్రేమించునట్లుగ నొనర్పగలి
గినను కాలము గడచిన కొలదిని "పాడినదే పాటరా పాచిపళ్ల
దాసరి" అనుసామెతక్రిందికి దిగి తమయొక్క వాగాడంబర
మంతయు నిరర్థకమగును. అట్టివారిని యువతులు వాగ్శూరుల
క్రిందను వాచాలురక్రిందను పై పిచ్చి మోహోన్మాదులక్రిం
దను బరిగణింతురు. కావున నెప్పటికిని యువతులతో బ్రథమ
పరిచయమప్పుడే మితిమీఱిన ప్రేమసంభాషణములకు
గడంగరాదు. సాధారణముగ స్త్రీప్రకృతికి నభిరుచికర
ములైన కృత్యములద్వారాగాని లేక వస్తువులద్వారాగాని
వారితో బరిచయము జేయవలయును. సుసౌరభసంశోభిత

ములగు కొన్నిసుమధామముల స్వయముగగాక నితరులద్వారా పంపవలయును. అప్పుడు వారు వానిని హృదయపూర్వకముగ గైకొని, దానికి ప్రత్యామ్నాయముగ మఱియొకనాడు ప్రేమ సూచకము లగునట్టి కొన్నిపదార్థముల నంపెదరు. ఈవిధముగ నొనరించినపిదప కాలక్రమేణా వారిప్రేమ దినదినప్రవర్థ మాన మగుచుండును. ఇట్లు కొన్నాళ్లు గడచినతదుపరి వారి రువురిహృదయములందు నొకరిపై నొకరికి యత్యంతగాఢాను రాగము ప్రభవించును. తదుపరి యొకరి నొకరు చూచుకొన వలయుననియు, నొకరిప్రక్క నొకరు కూర్చొనియుండవలయు ననియు, నొకరినొకరు గాఢాలింగన మొనర్చుకొని, యొకయే కాంతస్థలమునందు, నొకయుద్యానవనమునందు, పూపొద రిండ్లమధ్య, నిండాగశరత్కాలచంద్రికలు వారిని జూచి నవ్వు చుండ, సుమసౌరభము వారి నాసికాపుటములందు జొచ్చి వారిని తన్మయత్వము నందజేయుచుండ, బిల్లతెమ్మెరలు మెల్లమెల్లగ వారిని జోకొట్టుచుండ, నిద్దరును నొకటై—— "భావానుకూలరత మొకటై వెలయు పరాత్పరచిదానందము లన్" అని ప్రాచీనశాస్త్రకారులు చెప్పినటుల నట్టిచిదానంద స్వరూపవ్య మందవలెనని యూరక నువ్విళ్లూదురు. ఇట్టిభావో ద్వేగముచే గలిగిన యీవేదనతో గూడిన మనస్సులు గల వారలై కొంతకాల మూరక నొకరికొఱకొకరు తపియించుచుం దురు. కాని అట్టియదనున హఠాత్తుగ నిరువురును గలిసికొ న్నచో నొకరి నొకరు క్రేగంట జూచుకొని, పిమ్మట లజ్జాభ

రముచే నొకరితో నొకరు మాటలాటకు వెనుదీయుదురు. ఆ పైని కొన్నాళ్ళకు నాయూవేదన మఱింత హెచ్చి, యొక రితో నొకరు సంభాషణముల నెఱపుకొనవలయునని వాంఛిం చుచుందురు. అటుతర్వాత నాయువతీయునకులు దమయనుంగు చెలికాండ్రద్వారా సందేశముల బంపుకొని వారిరువురు సమావేశ మగుటకు దగినకాలమును, స్థలమును నిర్ణయించుకొని యెదరు. ఇట్లు నిర్ణయించుకొని, నిర్ణీతకాలమునకు నిర్ణీతప్రదేశ మునం దిరువురును సమావేశ మగుదురు. కాని యందుగూడ నొకవిచిత్రసంఘటనము కలుగును. అట్లు వారిరువురును నిర్ణ యించినకాలమునకు గొంతముందుగా నాయువతి యాప్రదేశ మునకు జేరి తనప్రియుని రాకకై యాతురతతో వేచియుం డును. అట్టిసమయమునం దాపెమనమునం దనేకవిధములగు భావము లుదయ మగును. ప్రియుడు తన్ను సమీపించినచో నతనిని దానెట్లు లాహ్వానింపవలసినదనియు, తాను ముందు పలుకరింపవలయునా, యాతడు ముందు పలుకరించునా యని యు, ప్రప్రథమమున నాతనితో నెట్లు పలు కాడవలసినదియు నీవిధములైన యనేకమధురభావము లాపెహృదయములో విజృభించి యాపెను నూఱక యూపివైచుచుండును. ఇక యు వకు డానిర్ణీతప్రదేశమునకు వచ్చుచు నాపెను జూడవలయునని యుకే భావమును గలిగి, యున్మత్తునివోలె వడివడిగ వచ్చుచుం డును. అట్టియెడ ప్రియునిరాకను కనిపెట్టి యాప్రియురాలు తనసహజమగు లజ్జాభరముచే నాతని నెదుర్కొనజాలక నత

నికి గనబడి కనబడకుండు స్థలమున దాగికొని, యేవో పుష్పములు కోయుదానివలె నంటించును. అంత యువకు డచ్చోటి కేతెంచి, యచట తనప్రియురాలు రాలేదని హాతాశయుడై పిచ్చివాని వలె నటునిటు జూచుచుండును. ఇతనిచేష్టలన్నిటిని యాపె చాటున బొంచియే పరీక్షించుచుండును. తనకొఱకై యతడు పడు నారాటమంతయు గన్నులార జూచి, తనహృదయమందు నాతడు తనపై నిక్కమగు ననురాగమును గలిగియుండెనని దృఢపఱచుకొని సంతోషితస్వాంతయై యుండి, యాతని యొక్కొక్క చెయిదమునకు లోలోన నవ్వుకొనుచుండును ఇట్లొకింతసేపు నాటకమాడిన తదుపరి యువకు డాయువతికై వేచియుండి యచ్చటనే దీర్ఘాలోచనాతత్పరుడై, వేడియూర్పులను నిగుడించుచు నిరాశాపూరిత లోచనుడై, యొకచో చతికిలబడి కూర్చుండును. అట్టిసమయమునం దాయువతి మెల్లమెల్లగ నడచుచు నాతనికంటికి దెలియునట్టి స్థలమున కరుగుదెంచి, పూవుల గోయున ట్లభినయించుచుండును. అప్పు డాయువకుడు తన వెదకుచున్నట్టి నేత్రముల కాపె పొడగట్టగనే, క్షణకాల మాశ్చర్యచమకితుడై భ్రమాన్వడియుండును. పిమ్మట మెల్లమెల్లగ నాపెను సమీపించి, యాపె నామధేయముతో నాపెను సంబోధించును. అంత నాయువతి తననామముచే దన్ను పిలుచు తనప్రియునికంఠస్వరమున కొకసారి యదరిపడి, యొక్కలిప్తకాల మతనివంక దన భీతహారిణేక్షణములను బఱపి, పిమ్మట యమితలజ్జాభరముచేత గలిగిన వింతభీతిచే నాను

దిరిగిపోవ జూచును. అట్టియెడ నాయువకు డామె యెట్టియవస్థ
యం దుండినదియు నామె బెదురు చూపులవలనను, లజ్జాభర
ముచే వాంచియుండు ముఖమువలనను బాగుగ గుర్తెఱింగి,
యామెను మెల్లగా యొక్కసారి ప్రేమసూచక మగునట్టి తన
మృదుమధుర కంఠస్వరముతో బిలుచును. అంత నాయువతి
పులకాంగితయై, ముం దడుగిడజాలక నిలబడిపోవును. అప్పుడు
యువకుడు "నీవెందు బోయెద" వని ప్రశ్నించును. అప్పుడామె
ప్రత్యుత్తర మొసంగుటకు లోలోన యారాటపడసాగును
గాని లజ్జాభరముచే మాటలాడక మౌనముద్రను వహించి
తలవాంచి నిలుచుండును. అట్లు లుండిన, యామె తనపై
ప్రేమ గలిగియున్నదనియు, నింతకుబూర్వ మిట్టి రహస్యసమా
వేశము లితర పురుషులతో నొనర్చియుండలేదనియు, కావుననే
యామెకంత లజ్జయును, భయమును గలిగెననియును, నామె
యౌవనభాగ్యరేఖ నూత్న వికసితసుమమును, నవ్యశోభాయు
తమును నై, పరిగ్రహయోగ్య మనియు నాయువకుడు
సుస్పృథ మనస్కుడై, జాలియు ప్రేమయు గొల్పెడు చూడ్కు
లతో నామెను మెల్లగ సమీపించి మెల్లగను, తొట్రుపాటులే
కను, శాంతముగను, భయమును బోగొట్టునట్లుగను నేవే
వియో కొన్నిమధుర సంభాషణలనో లేక ప్రశ్నలనో వేయుచు
నామె కంపితహస్తమును పుష్పమును బట్టుకొన్నరీతిగ బట్టు
కొనును అట్టిశీతకరస్పర్శ, యామె సర్వాంగకములకు కంప
మొదవించి, చెమ్మట లూరజేయును. ఆతనికిగూడ నామెకరస్పర్శ,

విద్యుత్ప్రసారమువలె, రక్తనాళములగుండా ప్రసరించి, ముఖ
మునకును, చూపులకు నొకవింతశోభ నొడగూర్చును. అట్లు
పట్టుకొని నాత డాపెహస్తమును మెల్లగ దనహస్తముతో
యెద్దియే నొకరమ్యమగు స్థలమును జూపించి యచ్చటకు
బోయి కూర్చుందమని చెప్పును. అప్పుడాపె దారముతో బోవు
గాలి పడగవలె మెల్లమెల్లగ తొట్రిలు పదములతో నడచుచు
నాతనిని వెనువెంటనే పోయి, యానిర్ణీతస్థలమున నాతనిబలా
త్కారముపై నాతనిప్రక్కనే తానుగూడ నాసీనయై తల
వాంచి కూర్చుండును. కాని యానమయమునం దాపెకు ప్రప్రథ
మున నున్న లజ్జయును భీతియును గొంతవఱ కడంగిపోవును.
అప్పుడప్పుడు తానుగూడ తనప్రియు డావలిమొగమై యున్న
తఱి తనక్రేగంటి చూపులచే నాతనివంక జూచుచుండును.
అప్పు డాయువకు డాపెయొక్క భయమును బూర్తిగ దొలంగ
జేయుటకు బ్రయత్నించును. లేకున్న నాయువతి నతనిని మో
టువానిగ దలంచి, యతనిని ప్రేమించుటకుమారు కాలక్రమే
ణా యతనిని యసహ్యించుకొనును. అది యెఱింగి యాయువ
కు డాపెకు ఆసమీపమునందలి ప్రకృతి సౌందర్యమును జూడు
మని చెప్పుచు, దానిని గుఱించి యేవేవియో చెప్పుచు, నాసం
దర్భమునం దాతడేదో యొకవిషయమును గుఱించి యాపెకు
గల యభిప్రాయమును దెలుపమని కోరును. అప్పటి కాపెకు
చాలవఱకు భయము దక్కి కొంత చిత్తస్థైర్యము గలిగి, మెల్ల
గా దనయభిప్రాయమును దెలుపును. ఇట్లాపెచేత బలికించిన

వెంటనే యాయువకునికి మఱింత ధైర్యము గలిగి పిదప కొంత
సేపటివఱ కిరువురు చిలుకగోరు వంకలవలె నేవేవో ధారా
రముగ సరససల్లాపము లాడికొనిరెవరు. అప్పటికి యాయువ
తికిగూడ సంపూర్ణముగ భయము పోయి, యానందాతిశయ
ముచే బ్రఫుల్లమైన తననేత్ర యుగళము నాతనిపై నిల్పి యే
మేమియో శతవత్సరము లట్లే యాతనితో మాట్లాడుచు
నచ్చటనే కూర్చుండవలయునని కోరుచుండును. అట్టియదనున
నాయువకు డాపెతో, దాము వచ్చి చాలసేపైన దనియు, దమ
తమయిండ్లకు బోవుదమనియు జెప్పి మరల సమావేశదిన
మును నిర్ణయించి, యాదినమున దిరిగి యిరువురును సమావేశ
మగు నట్లాపెచేత నొప్పించి, నిక దాను పోవుదునని చెప్పును.
అట్టితఱి యాపె కాతనిని వీడుట ప్రాణమువీడుటవలె దోచును.
ఆపెవికసితముఖబింబ మొక్కసారి కళావిహీనమై, విచారరేఖల
దోపజేయును. ఆపెకు దెలియకుండగనే యాపె నేత్రముల
యందు బాష్పజలము లూరసాగును. అట్టి యశ్రుపూరితలో
చనములతో నాతనివంక నూఱక పిచ్చిదానివలె జూచుచుం
డును. అతని హస్తమును గట్టిగా బట్టుకొనును. పెదవు లూరక
వడవడ వడకుచుండును. మాటలు స్తంభించిపోవును. అట్టియవ
స్థను యువకుడు బాగుగ గుర్తెఱింగి, తనకుగూడ నాపెను విడ
చుట కష్టమను భావమును దోపజేయు చూపుల నాపెకు గన
బఱచి,పిదప నాపెను మెల్లగా తనహస్తద్వయముతో గౌగలిం
చుకొని దరహాసితవదనముతో నాపెకు ధైర్యము చెప్పి,

యాపెను కొలదికొలదిగ తనప్రేమరసధారల జిల్కెడు పల్కులతో గొంతవఱకు నోదార్చి, తప్పక తా నాయువతిని తప్ప నితరులను వివాహమాడనని బాసజేయును. అట్టిమాటలను వినగనే యాయువతి తన విచారమును జాలవఱకు మఱచిపోయి, చిరునవ్వు లొల్కజేయును. తరువాత నాయువకుడు పోయివచ్చెదనని చెప్పి తనహృదయోద్వేగము నడంచి, మామూలుగ మాటలాడులాగున మాటలాడుచునే యాపె చెక్కిలిని మెల్లగ నొక్కసారి ముద్దిడుకొని మరల వెళ్లెదనని చెప్పి యాపెను వదలి వెళ్లిపోవును. అట్లాతడు పోయిన పిమ్మట యాయువతి కొంతసేపటివఱ కచ్చటనే యుండి, యతడుపోయినదారినే చూచుచుండును. పిమ్మట తనచెక్కిలిని చేతితో దడుముకొనుచు, కొంతసేపటివఱకు నొకవిధమైన చెప్పరాని యావేదన పడుచుండును. అప్పు డాపె కొంతసేపటివఱకు ప్రపంచమే గోచరింపని స్థితిలో నుండును. ఆనాటినుండి మరల తాము నిర్ణయించుకొన్న దినము వచ్చువఱకు నూరక దపించుచుండును. ప్రతినిమిష మాపె కొకయుగముగ దోచును. ఎల్లప్పు డాతనిని, తమయిరువురి సమావేశమును నాప్రథమచుంబనము యొక్క మాధుర్యమును సంస్మరించుకొనుచుండును. రహస్యముగ గూర్చుండి యాతని చిత్రపటము నవలోకించు చుండును. ఈవిధముగ తొలిముద్దుయొక్క ప్రభావము యువతీయువకులలో జెలరేగుచుండును. ఇట్టితొలిముద్దే వారిభావివైవాహిక జీవిత సౌఖ్యమునకు ప్రప్రథమ సోపానము. ఇట్టిముద్దు

నందే యువతీ యువకుల జీవిత సారాంశ మిమిడియున్నది. ఇట్టిముద్దువలననే యువతీయువకుల మధ్య నన్యోన్య ప్రేమాను రాగములు దినదిన ప్రవర్ధమానము లగును. ఈముద్దే ప్రపంచము నంతటిని జయింపగలుగును. ఇట్టిముద్దే యాధునిక వివాహ్యనిర్దిష్ట యువతీయువకులకు ముఖ్యాదర్శప్రాయము.

ఇట్టి యాదర్శ ప్రాయమగు ముద్దును గూర్చి ప్రాచీన సుప్రసిద్ధాంగ్లకవు లీక్రిందివిధముగ నభివర్ణించియుండిరి:—

"Then come and kiss me
sweet-and-twenty
(Shakespere)

"Be plain in dress, and sober in your diet,
In short, my deary, kiss me, and be quiet"
(Montague)

"A long long kiss, a kiss of youth and love"
(Byron)

O Love, O fire! once he drew
With one long kiss my whole soul through
My lips as sunlight drinketh dew"
(Tennyson)

"The kiss—the gate to heaven"
(Penullanna)

"He kissed, then saw life new"
(Morton)

ఇట్లనేక తెఱంగుల నీతొలిముద్దును ననేకమంది సుప్రసిద్ధకవు లభివర్ణించియుండిరి. ఇట్టిముద్దులోనే వివాహితులగు నూత్నయువదంపతుల ప్రేమరస మిమిడియున్నది. ఇట్టిముద్దుద్వారా నాదంపతుల ప్రేమ చంచలము లేక స్థిరీకృతమై, వారియనురాగలతను నానాటికి సుదృఢమగున ట్లొనరింపగలదు.



# తియ్యనిముద్దులు



ప్రస్తుతము ప్రపంచమం దెల్లడలను నున్నత స్థాన మాక్రమించి, యెల్లర చేత ననేకవిధములు గబొగడబడుచున్న పవిత్రప్రేమ పూరితము లగునట్టి తియ్యనిముద్దులు తల్లిముద్దులు. ఈముద్దులు ప్రపంచములో నున్న యన్ని ముద్దులలోను శ్రేష్ఠతమములును, నత్యంతావశ్యకములునై యొప్పారుచున్నవి. ఈముద్దులు, అమృతముకంటె మధురతములై శిశువుల దినదినాభివృద్ధికి ముఖ్యములై యున్నవి. • ఇట్టి పవిత్రప్రభావమును గలిగిన మాతృచుంబనములను గ్రోలనిజీవి సర్వసాధారణముగ నీవిశ్వమందు లేడనియే చెప్పవచ్చును. ఇట్టి పవిత్ర ప్రేమపూరితములగు దల్లుల తియ్యని ముద్దులను గుఱించి కొంతవఱకు బరికింతము:—

తల్లి, తాను నవమాసములు శిశువును తనగర్భమందిడి కొని, మోసి, ప్రసవదినమునం దష్టకష్టముల పాలగును. అట్లు తనగర్భములోనుండి శిశువు భూపతనము కాగానే, యాశిశువు తనయొక్క రక్తమాంసములలో నొకభాగమనియు, తనప్రేమైకస్వరూపమనియు, తనప్రాణరత్నమనియు నంభావించి, యాతనిని దనకంటికి ఱెప్పయట్లు కాపాడుచు వచ్చును. నూ

తల్లులు విసుగు జెంది, యాశిశువును దండింతురు. అట్లొన ర్చుచుండినచో నాశిశువునకు కాలక్రమేణా యాపైపై నుండు పవిత్ర ప్రేమభావము భక్తి క్షీణింపసాగును. కావుననే యిప్పటి యువకులలో గొంతమంది తమతల్లిదండ్రులయందు భక్తి గౌరవములు లేక వారేది చెప్పినను ధిక్కరించుచుందురు. దీనికి కారణ మతనిని పిన్ననాటనుండియు దల్లిదండ్రులు సరిగా పెనుపకుండుటయే.

కానియిప్పటితల్లులు తమ పిల్లలను ముద్దుపెట్టుకొను టలో దెలివిని తనముచే నక్రమమార్గముల నవలంబించుచు న్నారు. దానివలన పిల్లలయారోగ్యము చాలవఱకు భంగమం దుచున్నది. కొందఱు తల్లులు సాధారణముగ దమ పిల్లలను ముద్దుపెట్టుకొనుటలో వారినోటిలో తమనోరును బెట్టి యూరక నెంగిలిజేయుచు ముద్దుపెట్టుకొనుచుందురు. దీనివలన తమ శరీరములో నుండు ననేకవ్యాధులు కొన్ని వారికిగూడ దాకి వారుకూడ రోగబాధితులగుదురు. కావున నిట్టి యెంగిలి జేసి శిశువులను ముద్దుబెట్టుకొను విధాన మెంతయు గర్హ్యము. పైపెచ్చు శిశువుల యకాలమరణములకుగూడ ముఖ్యకారణ మగును. కావున తల్లు లెప్పుడును ముద్దుపెట్టుకొనునపుడు నోటిలో నోరు పెట్టుటగాని, యెంగిలిచేయుటగాని కూడదు. మఱియు మనవారిలో సాధారణముగ బిల్లలి నెవరుపట్టిన వారు ముద్దిడుకొను నభ్యాసము గలదు. అట్టిచో నాముద్దు పెట్టుకొనువా రనేకులనేకవిధములగు జాడ్యములను గలిగియు

న్నచో నాజాడ్యములన్నియు బిల్లవానికి దాకును. కాబట్టి యీవిషయములో తల్లు లతిజాగరూకులై యుండవలయును. తల్లులు తమపిల్లలను ముద్దిడుకొనుటలో నెప్పుడు చెక్కిళ్లపైననే ముద్దిడవలయును. ఆముద్దైనను గాఢముగ నుండరాదు. తమ పెదవులను వారిచెక్కిళ్ల కంటి యంటనటు లుంచి యెంగిలి తగులకుండ జాలసున్నితముగ ముద్దిడుకొనవలయును. ఇట్టిదియే తల్లులు పిల్లల కివ్వవలసిన సక్రమమైన తియ్యని ముద్దు, మఱియు నేదేని మనోవ్యాకులముచే బాధపడుచున్నపుడుగాని. వ్యాధిగ్రస్తురాలై యున్నపుడుగాని, భావోద్వేగములో నున్నపుడుగాని తల్లి పిల్లలను ముద్దిడరాదు. అట్లు ముద్దిడినచో నట్టిది వారికి విషప్రాయమై యొక్కొకపుడు ప్రాణాంతకము కూడ నగును.

ఈపైజెప్పబడిన యంశములనుబట్టి పిల్లలను దల్లులు ముద్దులు పెట్టకొనగూడని విధానములును, పెట్టుకొనవలసిన తీరును కొంతవఱకు విస్పష్టమయ్యెనని మాయూహ. కాని యట్లు తల్లులు శిశువులను ముద్దుపెట్టుకొను టెందులకు? అప్పుడు వారి మానసికతత్త్వ మెట్లుగ నుండును? అను నీవిషయములనుగుఱించి కొంతవఱకు మేమిట ముచ్చటింప గడంగెదము. ప్రథమప్రశ్నకు మాప్రత్యుత్తర మేమనగా, జంతువులు తమ బిడ్డలను మూరక దమనాలుకతో నాకును. పక్షులు తమపిల్లలను తమ ముక్కులతోనే వాని శరీరమంతటిని యూరక చుమురు చుండును. ఈవిధముగ నీసృష్టిలో నుండు తల్లిపిల్లలమధ్య

నీతియ్యనిముద్దులు వ్యాప్తమైనవి. ఇవి స్వభావసిద్ధము లైనవి. ఇక రెండవప్రశ్నకు మాసమాధానము నొక యుదారణ పూర్వకముగ నొసంగెదము: ఒకతల్లి తనబిడ్డ డేడ్చునపుడును ముద్దుగ నాడుకొనునపుడును మాటలాడునపుడును, తప్పటడుగుల నిడ నారంభించినపుడును లేక తదితర సంతోషసమయము లందును బిరబిర తనబిడ్డకడకు బరుగెత్తి యాతనిని తన రెండుకరములతో బట్టుకొని బిగ్గ గౌగలించుకొని చెక్కిళ్ల నూరక ముద్దు గొనుచుండును. అట్టిముద్దుల మాధుర్యము శిశువు గ్రహించి యమితానందభరితుడై యాపెకు నట్టి ముద్దులగొల్పు క్రీడలనే క్రీడింప గడంగును. అట్టియెడ నాశిశువును ముద్దిడుకొనుటలో గల నాతల్లియొక్క మనోభావవైచిత్ర్యము వర్ణించుట కెరికిని దరము గాదు. కాని యట్టు లామె తనశిశువును ముద్దిడుకొనుటకు బర్వులెత్తునపు డెవరైన వెనుక నుండి లాగినను, లేక నడ్డగించినను నప్పటియాపెముఖవైవర్ణ్యము ప్రళయకాలద్వాదశాదిత్యతైక్ష్ణ్యమును బొంది యుండును. దీనికి గారణము తనప్రాణసర్వస్వ మగు తన శిశువునకు దనతియ్యనిముద్దు నొసంగనీయకుండుటయే. కాబట్టి యీపైవిషయములనుబట్టి మనకు పిల్లలకు దల్లు లిచ్చు ముద్దులే తియ్యనిముద్దులని స్పష్ట మయ్యెను. అట్టి తియ్యనిముద్దుల యొక్క తియ్యదన మన్నితియ్యదనములకంటెను మించియుండును. ఆముద్దులలో నానందము, ఆరోగ్యము, పవిత్రప్రేమ మొదలగునవి యిమిడియున్నవి. అట్టిముద్దుల తియ్యదనమును జవిజూడని జీవి సాధారణముగ నీలోకమునందు లేదనియే చెప్ప నగును.

---

# కమ్మని ముద్దులు



ఈకమ్మనిముద్దులయొక్క కమ్మదనము, మనము నిష్పాక్షికముగ జూచినచో మనదేశమునందుకంటె పాశ్చాత్య దేశములందే బాగుగ గ్రహింపబడెను. వీనికమ్మదనములో గల ప్రభావమునందు మనకంటె వారి కెక్కు డనుభవము గలదు. ఈకమ్మనిముద్దులు సర్వసాధారణముగ తోబుట్టువులందు ప్రవర్థమాన మగుచుండును. పాశ్చాత్య దేశములందు గల తల్లి దండ్రులు తమకు జనించు బిడ్డ లందఱికి తమయొక్క తియ్యని ముద్దుల యభిరుచిని వారికి దెలియజేయుటయే గాక, ఆశిశువుల నొకరి నొకరు ముద్దుపెట్టుకొనునట్లుగ జేయుదురు. కాని మన దేశమునందుగూడ పసితనమునందు గల తోబుట్టువులు తమలో దాము తమకంటె పిన్నవయస్కులగు నేతమ్ములనో, చెల్లెండ్రనో ముద్దులు పెట్టుకొనుచు వారి నాడించుట యాచా రమైపోయినది. కాని వారు కొంత పెరిగి పెద్దవారు కాగానే ముద్దులపెట్టుకొనుట మానివేయుదురు. తల్లిదండ్రులుగూడ నాముద్దులయొక్క ప్రభావమును గుఱించి వారికి బోధపఱచక మిన్నకుందురు. అట్లు వారి కాముద్దులలో నుండు పవిత్రప్రభా వము దెలియకుంటచే వారు కాలక్రమేణా పెరిగినకొలది వారిలో నొకరిపై నొకరికి పిన్నతనమునం దున్నట్టి ప్రేమ

భావము, వాత్సల్యము రానురాను సన్నగిలిపోవుచుండును. పెద్దవారైనతరువాత వివాహములు గావించుకొని, యెవరి భార్యలతో వారు కాపురములు జేయుచు, ప్రత్యేకముగా నివసించుచు, గడ కేవేనికష్టములు సంప్రాప్తించినవు డొకరి కొకరు సహాయపడక 'నెవరికి వారే యమునాతీరే' యను రీతిగ ప్రవర్తించుచుందురు. ఈరీతిగ మనదేశములో నీకమ్మని ముద్దుల కమ్మదనముయొక్క యనుభవము విహీనమగుటచే పరోపకారపరాయణత, వాత్సల్యము, దయ మొదలైనవి నానాటికి క్షీణింపమొదలిడినవి.

ఇక విదేశములలో నట్లుగాక చిన్నతనమునుండియు పిల్లల నొకరి నొకరు ముద్దులు పెట్టకొనునట్లు చేయుదురు. అట్టిముద్దులయొక్క భావమును వారికి దెలియబఱచుటకు, వారిలో వారేదేని తప్పొనర్చినపుడుగాని, యొకరి నొకరు కొట్టుకొని తిట్టుకొని పోరాడునపుడుగాని, క్షమాపణసూచకముగను, శాంతిచిహ్నములుగను నొకరొకరిని ముద్దులు పెట్టుకొనునట్టు లాజ్ఞాపించి వారిచే నట్లు చేయించెదరు. దాని వలన యాశిశువుల కొకరిపై నొకరికి ప్రేమవాత్సల్యబాంధవ్య పాశములు మఱింత గట్టిపడి, పెరిగి పెద్దవారైనపుడుగూడ నొకరి కొకరెంతయో సహాయపడుచు నుందురు. వారిశిశువులలో నెవ రేతినుబండారము తెచ్చికొనినను, తమతోడివారల కివ్వనిదే వారొక్కరు భుజింపరు. చిన్నప్పటినుండియు నొకరి కేదైన రోగము గలిగినపుడుగాని, బాధ గలిగినపుడుగాని,

యితరబాలు రెవరైన దమ్మునకొట్టవచ్చిను డీతోఁబుట్టువు లంద
తేకీభవించి యొకరి కొకరు బాసటమై నిలిచి, బాధల కోర్చుచు
ధైర్యముగా, సంతోషముగా వానినెల్లను నిగ్రహించుటకు
సంసిద్ధులై యుందురు. రాత్రి యాహారమును భుజించిన
పిమ్మట పరుండబోవునపుడు తలిదండ్రులు పిల్లలు నొక్కచో
గూర్చుండి భగవంతుని గుఱించి యందఱును చేతులు మోడ్చి
నమస్కరించుచు నిమీలితనేత్రులై వేడికొనియెదరు. పిదప
బరుండబోవునపు డొక్కొక్కరుగ బిల్లలు తలిదండ్రులవద్ద
కేతెంచి వారిచెక్కిళ్లను ముద్దిడుకొనియెదరు. ఆపైని యీ
పిల్లలు తమలో తా మొక్కక్క రొక్కొక్కరిని ముద్దులు పెట్టు
కొని పిదప తమతమపడకలపైని గూర్చుండి ముద్దుపల్కుల
నాడుకొని పరుండి గాఢసుషుప్తిని జెందెదరు. అట్లు రాత్రి
యంతయు సంతోషముగ నిదురించి ప్రొద్దుననే తమతల్లి
యొక్క ముద్దులచే మేల్కొనియెదరు. అట్లుగాక వారిలో
తమతలిదండ్రులకంటె ముందుగ నెవరైన మేల్కాంచినచో
దక్కనవారి నొక్కొక్కరిని ముద్దులిడుచు వారిని మేల్కొ
పెదరు. అట్లు వారు వేకువజాముననే మేల్కొనినపిదప సంత
ఱును మరల నొక్కచో గలిసి భగవంతునిగుఱించి ముకుళిత
కరములతోను నేత్రములతోను దమ్ము గాపాడమని ధ్యాన
మొనర్చి, యాపయిని యొకరి చెక్కిళ్లపై నొకరు కమ్మని
ముద్దుల నిడికొని పిమ్మట తమతమ కాలకృత్యముల దీర్చుకొని
సంతోషముగ కాలమును వెళ్లబుత్తురు. ఈరీతిగ నాదేశములం

దీకమ్మనిముద్దులయొక్క ప్రభావము గ్రహింపబడినది. ఈ కమ్మనిముద్దులతో గూడ వారికి యాధ్యాత్మికవిజ్ఞానతత్త్వమును, ప్రతిదినము భగవంతుని ధ్యానించుటద్వారా కలుగజేయుదురు. ఈకమ్మనిముద్దులద్వారా తోబుట్టువులయం దొకరి కొకరికి పవిత్రమైనప్రేమభావోదయము బొడమి, వాత్సల్య మభివృద్ధి జెంది, వారు పెరిగి పెద్దవారై నతర్వాత యేయే దేశములం దెన్నిమైళ్లదూరమునం దున్నను నట్టిప్రేమవాత్సల్యములను వీడక, నుత్తరప్రత్యుత్తరములద్వారా తమతమ ప్రేమాతిశయమును దెల్పుకొనుచు నాజన్మాంతము నొకరిపై నొకరు ప్రేమను విడనాడక వర్తిల్లుచుందురు. ఈరీతిగ చిన్ననాటనుండియు నీకమ్మనిముద్దులు వారికనుభవములై యుండుటచే, వారు పెద్దవారై, యుద్ధభటులై, తదితరవృత్తులయం దున్నప్పటికిగూడ వారిలో వారికి యేకీభావము ప్రవర్ధమాన మైపోయినది. ఈరీతిగ నచ్చట నన్నికుటుంబముల వారుగూడ నీకమ్మనిముద్దులయనుభవమును బాగుగ గలిగిన వారగుటచే వారిలో మంచియైక్యభావము కుదిరి, యనేక దేశములను జయించి, యాక్రమించి, తమ యేకచ్ఛత్రాధిపత్యమును చలాయింప గలుగుచుండిరి. ఇట్టు లాదేశములం దీకమ్మనిముద్దులు ప్రజానీకమునం దొకరియెడలనొకరికి స్నేహవాత్సల్యమును, నేకీభావమును, సోదరభావమును పెంపొందింపజేసి, విశాలసామ్రాజ్యమును గడింపజేసి కీర్తివంతులుగను నజేయులుగ నొనర్పగలుగుచున్నవి.

ఇక మన దేశమునం దన్ననో పిన్నతనమునందు తప్ప సోదరులు కొంచెము పెరిగి పెద్దవా రైనచో ముద్దులు పెట్టుకొనుట యసహ్యమని తలంతురు. అట్టు లొకవేళ వారొకరి నొకరు ముద్దులు పెట్టుకొన్నచో వారిని జూచి వారిసన్నిహితబంధువులును, స్నేహితులు, నితరులు వారిని పిచ్చివారలుగ దలంచి పరిహసింప గడంగెదరు. అంతియేగాని యాకమ్మనిముద్దులయొక్క ప్రభావ మొంతయు దలంపనైన తలంపరు. ఇంకొక ప్రబలదాష్ట్యమేమన నొకకుటుంబములో నొకయన్నయు చెల్లెలు నుందు రనుకొనుడు. వారు చిన్నప్పు డొకరినొకరు ముద్దులిడుకొనుచుందురు. అంత వారికి గొంత వయస్సు రాగానే వారిరువురిని తల్లిదండ్రులు ముద్దులు పెట్టుకొన నిప్పరు. అట్లు ముద్దులుపెట్టికొనినచో నట్టిచర్యను దీవ్రముగ ఖండించుచు వారిని నిందించుచు దప్పు దలంచెదరు, కాని యాముద్దులయందు నిగూఢగుప్తముగు సోదరసోదరీవాత్సల్యము నేమాత్రము గ్రహింపక మూఢు లగుదురు. ఇట్టి చర్యలవలన నాయన్నచెల్లెండ్రుకూడ పెరిగిపెద్దవా రగుచో వారొకరికొకరు కొంతనూత్నముగ భావింప దొడంగెదరు. ఇది వఱకుబోలె యిద్దఱును కలిసి సంభాషించుటకు వెనుకాడుచుందురు. ఒకరి నొకరు స్పృశించుటకు దొట్రిలుచుందురు. ఈరీతిగ వారిమనోభావవైఖరులుగూడ నానాటి కానాడు వైపరీత్యము నందుచుండుట కవకాశములుగూడ తటస్థ మగుచుండు ననుటలో నెంతమాత్రమును సందియము లేదు. ఇట్టి

మూఢాచారమువలన మన దేశమున నీకమ్ముని ముద్దులయొక్క కమ్మదన మంతరించినది. అన్నను చెల్లెలు, చెల్లెలిని యన్న యును గ్రొత్తవారిగనే చూచుకొనవలసిన దుస్థితి యేర్పడి నది. ఇట్లు మనమందఱము పిన్నినాటనుండియు సంఘీభావము నకును, పవిత్ర ప్రేమభావములకును, సోదరసోదరీ భావోన్నతి కిని, స్నేహబాంధవ్యవాత్సల్యాదులకును, నిలయము లనదగు నీకమ్మనిముద్దులనుండి విముఖు లగుటచే నీకాలమున మన ప్రజలలో నొకరి కొకరికి యన్యోన్య ప్రేమభావములు పొసంగక, యొకరితో నొకరు పోరాడుకొనుచు, ఒకరి కాళ్ళు క్రింద జీలిపోవుచును, నొకరి నొకరు ద్వేషించుకొనుచు, తుద కు మన దేశమును నితరుల యధీనము జేసి, వారికి దాసాను దాసులమై, యనుదినము దాసోహ మ్మనుచు, బానిసలమై యుంటిమి.

కాబట్టి మన దేశములోని తల్లిదండ్రు లందఱు తమబిడ్డ లను బెనుచుటలో జాలజాగ్రత్తను దీసికొని వారిలో, చిన్నప్పటి నుండియు, నొకరిపై నొకరికి ప్రేమవాత్సల్యములు దయ సంఘీ భావము మొదలైనవి స్థాపితములై పెంపొందింప జేయవలసి యుండును. అట్టిచో నీకమ్మనిముద్దులను వారు గ్రహించి, చిన్నప్పటినుండియు దమబిడ్డల నొకరిచెక్కిళ్లపై నొకరిని ముద్దిడుకొనుచుండునట్లు చేసి, యాముద్దులయొక్క ప్రభావ మును వారికి సుబోధక మగుతెఱంగున నేర్పుచు వచ్చినచో, వారిలో భగవద్భక్తియు, సద్భావోదయము, సర్వమానవ సౌభ్రాతృత్వము పెంపొంది, భావిభారతదేశాభ్యుదయము నకు బాటుపడుటకు దగినవారై, యభ్యుదయ మంపగలరు.

# ముద్దుపెట్టుకొను టెట్లు?

వెనుకటి ప్రకరణములలో ముద్దులయొక్క విధములను గుఱించి మాపాఠకులకు గొంతవఱకు దేటదెల్ల మొనర్చితిమి. కాని కొంతమంది యీముద్దుపెట్టుకొనుటకు సంబంధించిన సక్రమవిధానములను గుర్తింపక, ననేకకుమార్గముల ననుసరించుచు, తమతమ దేహారోగ్యములను జెఱచుకొందురు. కావున మేమీప్రకరణమునం దట్టిముద్దులకు సంబంధించిన సక్రమవిధానములను గుఱించి కొలదిగ సూచింప గడంగెదము:—

సాధారణముగ నాధునికయువతీయువకులయొక్క జీవితము కేవలము కృత్రిమపూరితమైపోవుచున్నది. దీనికి ముఖ్యకారణము నవనాగరకతయే. ఈసందర్భమున పాశ్చాత్యనాగరకవాతావరణగ్రస్త మయిన మనభారతదేశమునందలి యువతీయువకులయొక్క కృత్రిమ జీవితములనుగుఱించి కొంతవఱకు బరిశీలింతము. మనదేశమునం దున్నపల్లెలలో కంటె పట్టణములయందే యిట్టి కృత్రిమజీవితముల కవకాశము లనేకములు గలవు. ఇట్టికృత్రిమజీవితములకు ప్రోద్బలమొసంగు కృత్రిమదృశ్యములు, పదార్థము లిప్పు డెల్లనగరము

లందు ప్రబలమై, యువతీయువకులను, నైతికముగనేమి, ఆధ్యాత్మికముగనేమి పలుతెఱంగులుగ నధోగతిపా లొన ర్చుచున్నవి. వీనిలో నన్నిటికంటె ప్రధానస్థాన మాక్రమించి నవి సినిమాప్రదర్శనములు. ఈప్రదర్శనములలోని నాయికా నాయకులు చిత్రవిచిత్రములైన యుడుపులను ధరించి యనేక తీరులుగ రంగమునం దలంకరించి చూపరలగు యువతీయువ కుల లేతమనస్సులను త్రుటికాలములో నాకర్షింపగలుగు చురు. ఆపైని తమయొక్క యసమానచమత్కార ప్రదర్శనా భినయములవలనను, వింతవింతలగు చూపులచేతను, తదుపరి యొకరి నొకరు గాఢముగ కౌగలించుకొని, యిరువురు నఖ శిఖపర్యంతము గాఢముగ ముద్దులు పెట్టుకొనుటవలనను, యువతీయువకుల హృదయములలో తమయొక్క విచేష్టిదము లన్నిటిని శాశ్వతముగ హత్తిపోవున ట్లొనర్చెదరు. వీనిని గాం చిన యువతీయువకులు తాముగూడ వారివలెనే యొకరిపై నొకరు ప్రేమవీక్షణముల బఱుపుకొనుచు పిమ్మట యొకరి నొకరు గాఢముగ కౌగలించుకొని, ఆపయిని యొకరి నొకరు నఖశిఖపర్యంతము గాఢముగ నూపిరితిరుగకుండ ముద్దు లిడు కొనవలె నను భావోద్వేగమును గలిగి యూరక నొకరి కొకరు తహతహపడసాగుచుందురు. ఇట్టి భావోన్మాదమువలన వారి యింద్రియవ్యాపార మపరిమితమై, యెక్కువ యలసిపోయి, పిమ్మట దుర్బలమై పోవును. అట్టిదార్బల్యదశయందు యువతీ యువకు లొండొరులు నఖశిఖపర్యంతరము గాఢముగ ముద్దు

లిడుకొన ప్రారంభించినచో తద్ద్వారా వారిరువురికి నారో
గ్యము చెడి, రక్తము విషప్రాయమై, ముఖకాంతి క్షీణించి,
పాలిపోయి, తుదకు క్షయ, పాండురోగము మొదలగు ననేక
దీర్ఘరోగములకు గుఱి యయ్యెదరు. మఱియు నింకొకప్రబల
దుర్గుణ మేమన, సినిమా ప్రదర్శనములలోని నాయికానాయ
కులు ప్రప్రథమమున వారిరువురు ముద్దులాడుటకుముందు,
నాయకుడు నాయికయొక్క చేతివ్రేళ్ళకొనలను ముద్దిడుకొ
నుట గలదు. దానిని జూచి, యిప్పు డిప్పుడు కొంతమంది
యువతీయువకులు తాముగూడ నట్టే యాచరింపవలయు
ననియు, నద్దియే నవనాగరకతాలక్షణ మనియు భావించుచు
న్నారు. దీనివలన వారియారోగ్యమునకు జెప్పరాని ఘోరా
పాయము సంభవించు ననుట తథ్యము. పూర్వకాలము
నుండియు నిప్పటివఱకును ప్రపంచమం దున్న యన్ని దేశములవా
రును చేతిగోళ్ళయందు విష ముండునని సిద్ధాంతీకరించి యట్టి
గోరులు మానవులశరీరములం దున్న రక్తమునకు తాకినచో
వెంటనే యారక్తము విషతుల్య మగుననియు భావించి
గోరులను పెంచుటను మానివేసిరి. అట్టిచో నిట్టిమోహోన్మత్తు
లగు యువకులు భావోన్మాదులై యట్టిస్థితియం దున్న యువ
తులయొక్క వ్రేళ్లను ముద్దిడుచుండునపు డాయువతియొక్క
గోరులు వీరికి గ్రుచ్చుకొని రక్తము స్రవించినచో దానివలన
వారిరువురికి యపాయము వాటిల్లగలదు. మఱియొకదురాచా
రము నోటిలో నోరు పెట్టి, యుద్రేకముచే నొకరియధరముల

కొకరు తమతమపంటికొనలతో గఱచుకొని గాయపఱచుకొ
నుట. పైదానివలెనే దీనివలనగూడ నెంతయో చెఱుపు గలు
గు ననుట నిర్వివాదాంశము. "మనుష్యుని కాటుకు మందు
లే" దన్నట్లుగ నీవిధమగు గాయములకు సర్వసాధారణముగ
చికిత్సయే యుండు టఱిది. కావున నిట్టి యపాయకరములగు
విధానముల నిప్పటియువతీయువకులు బాగుగ గుర్తించి, సద్వి
ధానములను గుర్తించి, తత్ప్రకారము ప్రవర్తించినచో వారి
కే యుపాయము వాటిల్లక ప్రఫుల్లజీవిత సౌఖ్యానందముతో
తులదూగ గలుగుదురు. అట్టివిధానము లెవ్వి యనగా, సం
పూర్ణయౌవనముతో దులదూగుచున్న యువతీయువకులు
సామాన్యముగా నవవికసితపుష్పములోని మధువు నానుటకై
మధుపము లెట్లు బఱతెంచివచ్చునో యట్లే యొకరి నొకరు
ముద్దిడుకొనుటకు వాంఛించుట సహజము. అట్టిచో నట్టిమధుర
వాంఛాపూరితములగు హృదయములు గల యువతీయువకు
లిరువురు తొలుతనుండి స్వచ్ఛందమైనట్టియు, నిరాడంబరమై
నట్టియు నైతికజీవితమును గడుపవలసియుండును. ఇంతియే
గాక వారు వివాహితు లగువఱకును తమశరీరమును చక్కగా
బోషించుకొనుచు రావలయును. శరీరములకు బుష్టిని గలుగ
జేయు శరీరవ్యాయామము క్రీడలు మొదలగువానిని యవశ్య
ముగ నాచరించుచుండవలయును. ఇంద్రియప్రేరేపణ గలుగు
సినిమానాటకప్రదర్శనములనుగాని, తత్సంబంధమైన నవలాది
గ్రంథములనుగాని బఠింపక నిర్మలనైతిక జీవితమును గడపుచు

నిష్కల్మష బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించుచుండవలయును. ఇట్టివారే వారివివాహము లైనతరువాత నొకరినొకరు ముద్దులాడు ఆనందభాగ్యమును బొందుటకు నర్హులు. అట్లుగాక, చిన్నతనమునుండి యింద్రియలోలురై, విషయవాంఛాపూరితులై యెల్లప్పుడును నట్టిదృశ్యములను, నట్టిభాషణములను నభ్యసించుటవలన వారికి చిన్న వయస్సునందే యమిత సంయోగాభిలాష చేతను, స్త్రీసంపర్కదోషమువలన ననేకరోగములు వారిశరీరముల కెగబ్రాకును. అట్టివా రొకరినొకరు ముద్దులిడికొనినచో నొకరిరోగములొకరికి క్రిములద్వారా నెగబ్రాకి, శరీరారోగ్యము చెడి తుదకు మృత్యువువాత బడియెదరనుటలో వీసమాత్రము సందేహము లేదని మేము విశ్వసించుచున్నాము. ఈరోగములు వీరితోనే పోక వీరికి జనించుబిడ్డలకుగూడ నెగబ్రాకి వారినిగూడ దుర్బలులుగను రోగగ్రస్తులుగను జేసివైచును. కావున పైజెప్పినవిధానముల నవలంబించుచు యువతీయువకు లొకరినొకరు ముద్దుపెట్టుకొనుటవలన గలుగుచెడుగులను మాపాఠకులకు దెలియజేసితిమి. ఇంకను నీముద్దుపెట్టుకొనుటలో నపాయకరములగు విధానము లెన్నియో గలవు. ప్రతివారిని ముద్దిడుకొనుట, ముద్దిడికొనినపుడు కూర్చొని ముద్దుపెట్టుకొనుట, మోహోద్వేగముచే నారాటపడుచు ముద్దుపెట్టుకొనుట, కుక్కలను ముద్దిడికొనుట, కామినీకాముకు లొకరినొకరు మొగమంతయు ముద్దులిడుకొనుట, ధ్వనితో

గూడుకొనిన ముద్దులాట, నోటిలో నోరుపెట్టి యెంగిలిజేయుచు ముద్దులిడికొనుట ముద్దుపెట్టుకొనునపుడు క్షమకముచే పురుషుడు స్త్రీయొక్క కేశమును నూరక చేతివ్రేళ్లకు పెనవేసికొనుట, ముద్దుపెట్టుకొనునపుడు తనయూపిరిని తననోటిలోనుండి స్త్రీనోటిలోనికి విడచుట, అధరములను గాయపఱచుట, కంచుకమును సడలించుట, పైకొనుట మొదలైనవన్నియు కూడనివే. ఇయ్యవి ప్రస్తుతము నవనాగరకులగు చాలామంది యువతీ యువకు లవలంబించుచుండుట పరిపాటియై పోయినది. ఇట్టి విధానములవలన స్త్రీపురుషాదుల శరీరారోగ్యము చెడి, రోగములు సంప్రాప్తించుటయేగాక ప్రాణాపాయముగూడ సంభవించును. ఇట్టివిధానము లన్నిటిని తప్పక నిషేధింపవలయును. చిన్ననాటనుండియు బ్రహ్మచర్యము నవలంబించుచు తాము సంసార జీవిత భాగస్థులు కాగోరినచో నట్టివారు నొకరినొకరు ముద్దులిడుకొనినచో వారికి స్వర్గలోక సౌఖ్యానందములు కరతలామలకము లగును. ఈవిషయమై మనప్రాచీనశాస్త్రకారులుగూడ నేయే వయస్సులవారిని ముద్దులిడినచో వారిద్వారా పురుషులకు సౌఖ్యము గలుగునో వివరించుచు, 13-16 ఏండ్లవయస్సు గలిగిన యువతులను ముద్దుపెట్టికొనినచో బురుషునికియొక్క పంచేంద్రియములకును సౌఖ్యమును, సంతోషమును గలుగుననియును, 17, 18 ఏండ్లవయస్సుగలిగిన యువతులను ముద్దుపెట్టికొనిన యానందమును, తేజస్సును గలుగుననియును,

ప్రౌఢస్త్రీని ముద్దుపెట్టుకొన్నచో జ్ఞానోద్దీపనమును, స్వాంత సంతోషమును గలుగుననియును, వృద్ధస్త్రీని ముద్దుపెట్టుకొన్న మొదల దేహపటుత్వ మంతరించి, యనేక వ్యాధులు పుట్టునని యు స్పష్టీకరించియున్నారు. ఇట్టి విషయములనన్నిటిని యాధునిక యువతీయువకులు బాగుగ గ్రహించి తమతమ శరీరారోగ్యములకు భంగము కానియటుల ముద్దులను బెట్టుకొనుచుండవలయును. వారెప్పుడును బహిరంగమగు ప్రదేశములందు ముద్దులను బెట్టుకొనక నేకాంతస్థలములయందే ముద్దులు పెట్టుకొనవలయును. పురుషుడు స్త్రీని ముద్దుపెట్టుకొనుటలో భావోద్వేగమును గన్పఱుపరాదు. ప్రశాంతమైన స్థలములందును, ప్రకృతిసౌందర్యము తొలుకాడు స్థలములందును స్త్రీపురుషు లిద్దరును జేరి, కొంతసేపు ఏకాంత గోష్ఠిని నెఱపిన పిదప, ముద్దులు ప్రకృతిసిద్ధము లగునట్టి వనుభావ మిరువురును గ్రహించి యొకరి చెక్కిళ్లపై నొకరు మృదువుగ ముద్దిడుకొనవలయును. ముద్దిడుకొనునపు డిరువురికి దమ్మెవరైన జూతురేమో యనుభయముగాని, తాము తప్పుచేయుచున్నంటి మను దురభిప్రాయముగాని, లజ్జగాని, యొకరిపై నొకరికి యనూయ, క్రోధము, మాత్సర్యము మున్నగునవిగాని యేమాత్రము గలిగియుండరాదు. రాత్రులందు నింద్రియప్రేరేపణ మొసంగు సినిమాలనుగాని, నాటకములను చూచినతర్వాత నవలలను పఠించిన పిమ్మటగాని వారిరువురు ముద్దిడుకొనగూడదు. రాత్రిపూటలందుమితముగ నాహారము భుజించి, మనః

ల్లేత మేమియు లేక, యానందపూరిత హృదయములతో నొకరి నొకరు దరిసి మందమారుతము వీచుచోటను, పండువెన్నెలలు గాయుచోటను, చల్లని ప్రదేశములందును గూర్చుండి, చిలుక గోరువంకలకు బోలె నొకరితోనొకరు సల్లాపము లాడుకొనుచు, నొకరియెంగిలి నొకరికిదాకనీయకుండ, చప్పుడు చేయక మృదు మధురములగు ముద్దుల బెట్టుకొనవచ్చును. పగటివేళలం దితర కార్యాచరణములచే నలసినశరీరములు గలవారలై, చండాత పతైక్ష్ణ్యముచే శరీరము లుష్ణములై యుండునుగాన నట్టి పగటి వేళలందెప్పుడుముద్దు బెట్టుకొనరాదు. అట్లు పెట్టుకొన్నచో ననవసర యింద్రియప్రేరేపణ గలిగి వారి నిరువురను పశుతుల్య క్రియకు లోనగునట్లుగ నొనర్చును. కావున స్త్రీపురుషు లెప్పుడును ప్రశాంత స్థలములందును, చల్లనిప్రదేశములందును, రాత్రిపూటలందును ముద్దుపెట్టుకొనవలయును. ఈసందర్భమున మాతో నేకీభవించుచు ముద్దులుపెట్టుకొను విధానమును లినోర్ వైట్ కన్య యీక్రింది విధముగ దెలుపుచున్నది:—

"If you'd enjoy the heavenly bliss
Extracted from a luscious kiss,
Then learn the art of arts most thrilling,
By catching, first, *a girl that's willing;*
And when you have caught her, as a test,
Just clasp her closely to your breast;
And if responsive to your greeting
You'll know it by her heart's quick beating

Then let your lips hers gently meet;
Take one long breath-*and then repeat*.
You will find in this sweet occupation
The acme of all osculation,
The cream of all entrancing blisses—
'Tis just the way my sweet heart kisses.
(Lenore White)

ఈపద్యముయొక్క తాత్పర్యము:—యువకు డొకయువతిని ముద్దిడుకొను నభిలాషను గలిగియున్నచో నప్పుడాత డా యువతిని సమీపించి, యామె తన్ను ప్రేమించుచున్నట్లు బాగుగ గుర్తించిన పిమ్మట నే దనవక్షమునందు జేర్చి మెల్లగ ముద్దిడికొనినచో, నట్టిముద్దువలన నిరువురికిని పరస్పరప్రేమ భావము కుదిరి, తద్ద్వారా యనురాగము, నానందము, సౌఖ్యము జేకూరుననియైయున్నది. ఈపై జెప్పిన పద్యమును లిఖించిన యామె తాను తనభర్తతో గాపురము జేయుచు నిరువురును సతతానందాబ్ధిని దేలియాడుచు, తనభర్తయొక్క మధురములగు ముద్దులచే దన్నెట్లు లాతడు కైవశము నొనర్చుకొనినదియు దనస్వానుభవముపైననే దెలిపినది.

కావున యీపై జెప్పబడిన యంశములను ఆధునిక స్త్రీపురుషాదులు చక్కగా గుర్తెఱింగి, తత్ప్రకారము ప్రవర్తించినచో వారిసంసార జీవన మెంతయు నానందకరమై సౌఖ్యవంతమై యొప్పారగలదని మాదృఢాశయము.

---

# ముద్దుల నడుగు లెట్లు?

—•••—

సృష్ట్యాదిలో నా ప్రేమమయపరంజ్యోతి యగు భగవంతుడు పిపీలికాది బ్రహ్మపర్యంతరము ద్వివిధములైన భిన్న ప్రకృతుల గల్పించి, యట్టిభిన్న ప్రకృతుల నడుమ నొకరి కొకరికి ద్వేషభావము, అసూయ మొదలగునవి లేక యనురాగము, దయ, ప్రేమభావము మొదలైనవి గలుగునటుల జేసి, తద్వారా యీయనంతమైన బ్రహ్మాండభాండము నంతటిని సృజించి, తనచిద్విలాసము నంతటను దాండవింపజేయు చుండెను. ఇట్టి ద్వివిధములగు భిన్న ప్రకృతుల రెండిటిసంయోగ సామరస్యాదులవలన నీసృష్టి నిర్విఘ్నముగ గొనసాగ గలుగుచున్నది. ఇట్టి ద్వివిధములగు భిన్నప్రకృతులు స్త్రీప్రకృతియును, పురుషప్రకృతియును. ఈప్రకృతులు పశుపక్ష్యాదుల కంటె మానవకోటిలో విజ్ఞానపూరితములై యున్నవి. ఈరెండిటిలో మొదటిది యగు స్త్రీప్రకృతి యతిసౌకుమార్యమును, మధురమును, సౌందర్యవంతమును నై యున్నది. ఇక రెండవది యగు పురుషప్రకృతి మంచి దార్ఢ్యమును, గంభీరమును, నుదాత్తౌదార్యోపేతమును, కరుణార్ద్రమును నై యున్నది. అట్టియెడ రెండవప్రకృతి సహజముగ దనకంటె నతికోమలమును దుర్బల

మును నగు మొదటి ప్రకృతిని బోషించుచు, ప్రేమించుచు
నుండెడి బాధ్యతను గలిగియున్నది. మృదులములైన సుమ
ములను దళము లెట్లు కాపాడుచున్నవో యట్లేపురుషప్రకృతిస్త్రీ
ప్రకృతిని కాపాడుచుండును. ఈవిధముగ దమ్ము కంటికి ఱెప్ప
వలె బోషించువా రగు పురుషులను సహజముగ స్త్రీలుఁగూడ
ప్రేమించుచుందురనుటలో నేమాత్రమును సందియము లేదు.
అట్లే యతిసుకుమారులగు స్త్రీలు, తమ్మునే, వారి ప్రాణరక్ష
కులుగ సంభావించుచు, నమ్ముచు, ప్రేమించుచుండుటచే,
పురుషులుగూడ వారిని ప్రేమించుచు వారికొఱకై యెల్ల
ప్పుడు ప్రాణములనైన సమర్పించుటకు సంసిద్ధులుగ నుందురు.
ఇట్లు స్వభావసిద్ధమైన ప్రేమానురాగము లొండొరులయందు
ననాదిసిద్ధములై యొప్పియున్నవి. కాని యిప్పుడు వీరిరు
వురును తమతమ బాధ్యతలను మఱచుచు స్వేచ్ఛావిహారాదు
లకు గడంగుచున్నారు. ఇట్టి స్వేచ్ఛావిహారాసక్తి పురుషు
లలోకంటె స్త్రీలలోనే మెండుగా గానిపించుచున్నది. ఇట్టి
యభిలాషలన స్త్రీపురుషాదుల మధ్య యనేకదుష్ఫలిత
ములు సంప్రాప్తమగుచున్నవి. దీని కంతటికిని కారణభూతులు
పురుషులనియే చెప్పవగును. ఏలయన, వారు తమ్మునెంతయో
విశ్వసించుచు బ్రేమించెడి స్త్రీజాతికి సాంఘికముగనేమి, మత
సంబంధముగనేమి నైతికముగనేమి ననేక ఘోరదురన్యాయ
ముల గావించుచు వారి యవిశ్వాసమునకు బాత్రులైరి. తమ్ము
బ్రేమించెడి స్త్రీలను తాము సరిగ బ్రేమించకుండుటయే దీనికి

గారణము. ఇప్పటి పురుషులకు దమతమపత్నులనే యేరీతుల ప్రేమించవలయునో సరిగ దెలియక వారి ప్రేమకు విముఖు లగుచున్నారు.

సహజముగ స్త్రీలయొక్క మనోవాంఛ లెప్పుడును వాయువేగ మనోవేగముల ననుసరించి పోవుచుండును. సుందరమగు పదార్థములను సందర్శించుటకును మధురము లగునట్టి యానందసంధాయకము లగునట్టి వానిని తనివిదీర యనుభవించి యానందించుటకును వారూరక తహతహలాడుచుండుదురు. అట్టి చంచలమగు స్త్రీహృదయమును బాగుగ గనిపెట్టి, వారి కభిరుచికరము లగునట్టియు, నానందజనకము లగునట్టియు కార్యములనే యాచరించుచు, తద్వారా వారిని తమ్ము విశ్వసించునట్లుగను, ప్రేమించునట్లుగను నొనర్చి వారి ప్రేమకు స్థిరత్వమును సంఘటిల్లజేయవలయును. వారికి పురుషులు తమయొక్క యుత్కృష్టమైన ప్రేమప్రభావమును తమ మృదుమధురవాక్కులలోను, ప్రశాంతమైన దృక్కులలోను, నున్నతముగ వారిని ముద్దిడుకొనుటలోను, కౌగలించుకొనుటలోను తమప్రేమోన్నతిని గన్పఱుపవలయును. దీని కుదాహరణముగ వివాహము కాబోవు యువతీయువకులను దీసికొని చర్చింతము:—

ఒకయువకు డొకయువతిని త్రికరణముగ ప్రేమించె నను కొందము. అప్పుడాత డామెనుగూడ దన్ను ప్రేమించునట్లుగ జేసికొనవలసియుండును. అప్పుడా యువకు డాయువతితో నొక్కొక

సారిగ తన ప్రేమనంతయు నేకరువుపెట్టక క్రమక్రమముగ తన సత్ప్రవర్తనవలన నామెహృదయములో నతడు తన్ను మిక్కిలి ప్రేమించుచుండెననియు, నతడే తనకు తగిన భర్తయనియు భావించునట్లుగ జేయవలయును. అట్లు కొంతపరిచయము గలిగినతరువాత, క్రొత్త యువతితో క్రొత్తయువకుడు మాట్లాడి నటులగాక, స్నేహితులతో మాట్లాడునట్లుగనే, మామూలు ధోరణిలోనే, ఏవిధమైన యార్భాటమునుగాని, వింతముఖవై వర్ణ్యమునుగాని తోపజేయక, దరహాసితవదనారవిందుడై, శాంతముగ, నేదేవో సద్విషయములను గుఱించియే యువకుడు యువతితో మాట్లాడవలయును. అట్లు చేసినచో నామెకు నాతనిపై నుండు ప్రేమానురాగములు గాఢములై పోవును. అటుపిమ్మట గొంతకాలమునకు వారిరువురును గలిసి విహారార్థమై, చల్లనిగాలి వీచెడి ప్రశాంత స్థలములకు బోయి కూర్చుండవలయును. అచ్చట యువకుడు యువతితో మృదుమధురములగు సంభాషణములను నెఱపుచు, పిమ్మట వారి కంట్లెయెదుట సాక్షాత్కరించిన ప్రకృతిదేవతలోని నిగూఢగుప్తమగు ప్రేమోన్నతినిగుఱించి యామెకు గొలదికొలదిగ జెప్పుచుండవలయును. అట్లు చేసినచో నాయువతికి నాతనిని విడుచుట కష్టముగ దోచి యెల్లప్పుడును నాతనిచెంతనే కూర్చుండి యట్టి మధురవాక్కుల నాతనిముఖతః వినవలయునని యాసక్త నువ్విళ్లూరుచుండును. అప్పుడు ఆమెముఖమున నొకనూత్న వికాసము గలిగి యాయువకుని హృదయమును మఱింత

యాకర్షించుచుండును. అట్టిచో నాయువకుడు తనమనోనిబ్బ
మును వీడక గంభీరముగ నుండవలయును. పిమ్మట మఱియొక
సాయంతనమందు ఆపెను వేఱొకస్థలమునకు దీసికొనిపోవల
యును. అట్టిస్థల మీసారి ఫలపుష్పతరులతాదులచే గూడుకొని
యుండవలయును. అప్పుడు ఆప్రదేశమంతయు సుమపరిమళ
ముచేత మందమారుతముచేతను నాక్రాంతమై, వారిరువురి
హృదయములందు నొకవిధమైన యావేదనను ప్రభవింప
జేయును. అప్పుడు యువకుని నేత్రముల కాయువతియొక్క
సర్వాంగకములు, సమ్మోహనములై యాతనిని బాదాపుగా
స్మృతి విహీనునిగ నొనర్పగలిగియుండును. అట్టిస్థితిలో
వారిరువురిహృదయము లుద్వేగముతో గొట్టుకొనుచుండును.
ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిగిడి వేడిగానుండును. అప్పుడు వారిరు
వురి చూపులలోను నొకవిధమైన కాంతి యుదయమగును.
ఇరువురిపెదవులును కంప మొందుచుండును. సర్వాంగకము
లును చెమర్చుచుండును. ఇదివఱకువలె నొకరినొకరు నిర్భయ
ముగ జూచుకొనుటకును, మాట్లాడుటకును వెను కాడుచుం
దురు. మౌనముద్ర వారిరువురియందును దాండవ మాడు
చుండును. అట్టిసమయమునందు యువకుడు మెల్లగా యువతి
యొక్క ప్రక్కనే యాపె శరీరమునకు దనశరీర మంటి యుంట
నట్లుగ నిలుచుండి యేవేవో మాటలాడుచు మెల్లగ నాపెహ
స్తమును పట్టుకొనవలయును. అట్లు తనహస్తముచే నాయువతి
హస్తమును పట్టుకొనగనే యాపెహస్తము వణకుచుండును.

కాని యాయువతిమాత్రము తనహస్తము నాతనిహస్తము నుండి తీసికొనుటకు ప్రయత్నింపక, తలవాంచి యూరకుండును. అట్లున్నచో నత్యాది యంగీకారసూచకముగ గ్రహించి యువకుడు మెల్లగా నాపెయొక్క హస్తమును పైకెత్తి తన భుజముపైన వేసికొనవలయును. అప్పుడాయువతికి శరీరము వణకుట మఱింత హెచ్చగును. అటుతర్వాత నాయువకుడు తన రెండవహస్తముతో నాపెయొక్క రెండవ హస్తమును మెల్లగా పట్టుకొని తనరెండవభుజముపైన వేసికొనవలయును. అప్పుడు వారిరువురు నొకరినొకరు అభిముఖులై నిలిచియుందురు. కాని యువతిమాత్ర మాతనియొక్క ముఖమును జూచుటకు ధైర్యము జాలక నధోముఖియై యుండును. అప్పుడు యువకుడు చిరునగవుతో మెల్లగా నాపెయొక్క గడ్డముచివర తనచేతినుంచి ముఖమును పైకెత్తుచుండవలయును. అట్లులెత్తునపు డాపె యతని బలవంతముననే తాను తనమొగమును పైకెత్తుచుండునటుల నటించుచు మెల్లగా తనముఖమును పైకెత్తును. కాని సాధారణముగ గొంతమంది లజ్జాభరముచేత ప్రియుని యొక్క ముఖమును జూడజాలక నేత్రములను గట్టిగ మూసికొందురు. కాని తమపెదవులుమాత్ర మా యువకులయొక్క పెదవులయొక్క ముద్దుల నాహ్వానించుచున్నట్లుగ నొప్పి యుండును. అట్టియెడ నాయువకుడు మెల్లగ మృదువుగ నంగిలి గాకుండ దన పెదవుల నా పెదవులపై నాన్చి మెల్లగా రాయుచుండవలయును. అంత నాయువతికి దేహమంతయు

బుల కాంకురమై మొగము నొకప్రక్కకు ద్రిప్పి తనచెక్కిలి యాతనియధరమునకు సామీప్యముగ నుండునట్లుగ నిలిచియుండును. అట్లుచేయునపు డాయువతియొక్క హృదయములో జెప్పరాని యావేదన యుదయించి దహింప నారంభించును. తనప్రియుని మధురమైన ముద్దు తనచెక్కిలిమీద నంకితమగుట కూరక నువ్విళ్లూరుచుండును. అట్టియదను గ్రహించి యువకు డాపెను తనహస్తద్వయముచే గట్టిగా గౌగలించుకొని తనవక్షఃస్థలమునకు హత్తుకొనుచు తన పెదవుల రెండిటిని యాపెచెక్కిలిపై నాన్చి ముద్దుపెట్టుకొనుచుండవలయును. అట్లు ముద్దుపెట్టుకొనినపుడాపె కెక్కడలేని యానందముప్పొంగి యొక్కసారి తన్మయత్వ మొందును. కొందఱు స్మారకము తప్పి కొలదిసేపు ప్రియునియొక్క భుజముపైననే వ్రాలిపోవుదురు. అప్పు డాయువకు డాపెను క్రింద బడ కుండగట్టిగ బట్టుకొని యొకచో గూర్చుండి యాపెశిరమును తనతొడపై నిడి, తన జేబురుమాలతోనో, లేక యుత్తరీయముతోనో విసరుచు నుండవలయును. అప్పు డాపె మెల్లగా కన్నులు విప్పి తనప్రియుని మొగమువంక చూచును. అప్పుడాతడు తననిర్మలమైన చూపుల నాపెపై బఱపుచు, ప్రశాంతమైన చిఱునవ్వు వెన్నెలల తన పెదవులపై దొలకాడ జేయువలయును. అట్టిచో నాపెవదనముగూడ ప్రఫుల్లమై, చిరునగవు దాండవించుచుండును. అప్పుడు మెల్లగ దనరెండవహస్తమును నాపెతలక్రిందుగా జొప్పించి మెల్లగ లేవనెత్తుచు, తాము వచ్చి చాలప్రా

ద్దయినదనియు, నిక యింటికకు బోవుదమనియు నుడువవలయును. అంత నాపె యతనిని వీడుటకు మనస్సురాక, మెల్లగ లేచును. అపు డిరువురు నొకరినొకరు పట్టుకొని కొంతదూరము నడచిన పిమ్మట, యువకు డాయువతితో 'బోయి వచ్చెద' నని చెప్పి, యాపెహస్తమును మాత్రమే పట్టుకొననలయును. అట్టియెడ నాయువతి యతని వియోగక్లేశమును భరింపజాలక లజ్జను భీతిని విడనాడి, నేత్రములనుండి బాష్పజలంబుల రాల్చుచు తన బాహుద్వయముతో గట్టిగ నాతనికంఠమును గౌగలించు కొని, "ప్రియా" యనియో, లేకతదితరములైన మధురప్రేమ పూరిత మృదుమధుర భాషణములనో పల్కుచు నాతని చెక్కిళ్లను, వదనమును నూరక ముద్దులాడుచుండును. యువకు డాయువతి యొక్కయవస్థను జూచి తానుకూడ బాష్పాంబు పూరితలోచనుడై, యాపెను తనవక్షఃస్థలమునం దట్టేయుంచి, యనేక విధములుగ దనప్రేమను, మృదుమధుర వాక్కులతో నాపెకు దెల్పుచు, నాపెయే తనప్రియురాలనియు, నాపెను తాను త్రికరణశుద్ధిగ ప్రేమించుచుంటిననియు, నాపెనే వివాహ మాడుదుననియు బాసజేయుచు, నాపెను ముద్దులాడి, ధైర్యము జెప్పి, యోదార్చి, పిమ్మట యాపెను వీడిపోవలయును. ఇట్లొ నర్చినచో వారిరువురియెడలను ప్రేమ దినదినప్రవర్ధమానమై చలనము లేక స్థిరత్వమును గలిగియుండును. కాని యీసంస ర్గమున కొందఱు యువతులు వేఱొకతీరుగ నుందురు. తమ్ము ప్రేమించిన యువకునిసామీప్యమున దా నుండుట దటస్థించి

నపు డాతడు తనసహజ మృదుమధురవాక్కులతో నాపి కేవియో సంగతులను దెల్పుచుండునపుడు వానినెల్లను నా యువతి బాగుగ వినుచునే యుండును. అట్టియెడ సాధారణ ముగ నాయువకు డాయువతి తనపై ప్రేమానురాగములు గలిగియున్నట్టుగ దెలిసికొని, పై జెప్పినవిధముగనే ముద్దిడుకొ నును. అంత నాయువతి కెక్కడలేని యాగ్రహము, యసూయ యావేశించి, కండ్లెఱ్ఱజేయుచు, మొగమంతయు జేవురించి, యాయువకుని ననేకవిధములుగ బ్రువ్వదిట్టును. అంతమాత్ర ముచే నాయువకుడు నిజముగ దన్నామె క్రోధముచే దూఱ నాడుచున్నదని భావింపరాదు. అయ్యది యాపెశరీర తత్త్వ మునుబట్టి జన్మించినది. ఆపె యితరులచే ముద్దుపెట్టబడుట కిదియే ప్రథమపర్యాయము గావున, నొక్కసారి యామె హృద యోద్వేగము పెల్లుబ్బిపోయి, యాయుద్వేగము నడంపగలుగు శక్తి యాపెకు లేకుండుటచే, నాపె నమస్తుత్తురాలినిగ జేసి యట్టు లనేకవిధములుగ వదరునట్లు జేయును. కావున నీవిష యమును బాగుగ గుర్తించి యాయువకు డాయువతినుండి కొల దిగ దొలగి నిలుచుండి, దీనవదనమును దోపజేయుచు, తాను మోహోద్రేకముచే నట్లు ముద్దుపెట్టుకొంటిననియు నట్టి దెంతయు నక్రమమనియు, తెలియక జేసిన కార్యమునకు తన్ను క్షమింపవలయుననియు, నికమీద తానట్టి యనుచిత కార్యము నాచరింప గడంగననియు నాపెను ననేకవిధ ములుగ బ్రార్థింపవలయును. ఈమాటల కాపెక్షమయా

గ్రహము కొలదికొలదిగ క్షీణింప నారంభించును. అట్టిలక్షణ
ముఁయొక్క జాడ లాయువకుడు కనిపెట్టినవెంటనే సవినయ
ముగ నాపెతో బోయి వచ్చెదనని చెప్పి, తిరిగి యాపెను వెను
దిరిగి వీక్షింపకుండనే తనదారిని దాను పోవలయును. అట్టు లా
యువకుడు తన్ను వెనుదిరిగి చూడకుండనే తలవాంచుకొని
పోవుటను చూచుచు, నాతడు కనుమేరదూరము కనబడునంత
వఱ కట్టులే నిరీక్షించుచు, పిదప నచ్చటనే కూలబడిపోయి,
యొకవెచ్చని దీర్ఘమగునిట్టూర్పును పుచ్చును. అప్పుడాపె
యొక్క ఉద్వేగము, ఆవేదన పూర్తిగ నశించును. వీనికి
బ్రత్యామ్నాయముగ నాపె లేత హృదయములో ననేక
విధములగు మధురభావములు చెలరేగును. ఇంతదనుక నాయు
వకుడు తొలుత తనతో సంభాషించినతీరును, పిమ్మట తన్ను
ముద్దుబెట్టుకొనుటయు, నట్లు ముద్దుపెట్టుకొన్నందుల కాతనిని
తా నేవిధముగ క్రోధావేశముచే దూలనాడినదియు, దానికి
నాత డిసుమంతయు నలుక వహింపక నటొనర్చిన తనతప్పిద
మును మన్నించవలయునని తన్ను కోరి వెడలిపోవుటయు
మొదలగు దృశ్యములన్నియు నొక్కసారి యాపెలో విజృం
భించుచుండును. అట్టియెడ దా నతనిని దూలనాడినందుల
కమితదుఃఖమును జెందుచు, కన్నులనుండి బాష్పబిందువులు
జలజల రాల నేడ్చుచుండును. అట్టి తన దౌష్ట్యమునకు ద
న్నానేకవిధములుగ దూలనాడుకొనుచుండును. తానాతని నన్ని
విధములుగ దూలనాడినను నాత డేమియు నలుక జెందక పైపె

నంసిద్ధురాలై యుంటిననియు, ననేక లీలాంగులుగ నతిదీనముగ నాతని హృదయమును గరగింపజేయుచు వ్రాయును. ఆ లేఖను చూచుకొని యానాయకుడు నాయికకడకు బోయినచో నాతనియుపదర్శన భాగ్యమువలన నామె యపరిమితానంద పారవశ్యముచేత స్తబ్ధయైపోవును. అంత నాయకుడప్పు డామెను గట్టిగ గౌగలించుకొని, మెల్లగ చెక్కిలిని ముద్దిడికొనినచో నట్టియెడ నాయిక, యాతని ముఖమును తనివిదీఱ గాంచుచు, తమకపూర్వక భావమును దెల్పు ముఖలక్షణములను తన్పుచు నాతనిచుంబనమునకై యెదురుచూచును. అప్పు డాత డామెను, తనవక్షమునకు మెల్లగా జేర్చికొని తేలికగా ముద్దుకొనినచో నామెకూడ తటాలున నాతనికంఠమును గౌగలించుకొని శరపరంపరలుగ ముద్దులవర్షమును గురియజేయును. ఈవిధముగ యువతీయువకు లొండొరుల మనోభావములను బాగుగ గుర్తించి యొకరినొకరు ముద్దుల నడుగుకొని, తద్ద్వారా యానందము ననుభవింపవలయును. ఈవిధానముల నవలంబించిన యువతీయువకులయొక్క భావిసంసారజీవిత మెంతయు సౌఖ్యసంతతమై యొప్పారి వారిరువురిమధ్య అత్యంత ప్రేమానురాగములు కుదురును. కాని "అతి సర్వత్ర వర్జయేత్" అను నార్యోక్తి ననుసరించి యిరువురు నెక్కువగా ముద్దిడుకొనరాదని మాయభిప్రాయము.

# భార్యల నెన్నుకొనుటెట్లు?



పూర్వకాలమునందు మనదేశములో వివాహములు మిగుల జనుప్రదములుగ నుండినవి. ఇప్పటివలె నప్పుడు పదవులకొఱకు ప్రాకులాడుటయు, ధనతృష్ణ మున్నగునవి లేక యందఱును నిరాడంబరజీవనమును గడపుచు తమకున్నదానితోనే సంతృప్తి నందెడివారు. కావున నారిప్పటివారివలె వివాహములందు కట్నములకొఱకై బేరము లాడుట యనవసరముగ నుండెడిది. ఇప్పు డన్ననో యట్లుగాక వధూవరుల యొక్క తల్లిదండ్రులు కట్నములకొఱకై పెనగులాడుచు నంగడిబేరములలోనికి దిగుచు మాపిల్ల కేమినగలు పెట్టెదరని పిల్లతలిదండ్రులును పిల్లవాని కేమికట్న మొసంగెదరని పిల్లవాని తలిదండ్రులు నొకరి కొకరు బేరము లాడుచున్నారు. ఎవ రెక్కువ తమపిల్లలకు నగలను బెట్టి ధనము తమ చేతిలో బోసెదరో వారికే తమపిల్లల నిచ్చి వివాహములు గావించుచున్నారు. ఎవ రెక్కువ తమపిల్లవానికి కట్నము లొసంగెదరో వారికే తమపిల్లవాని నిచ్చి పాణిగ్రహణ మొనర్చుచున్నారు. ఈవిధముగ వధూవరుల తలిదండ్రులు తమబిడ్డల భావి వైవాహికజీవిత సౌఖ్యము నేమాత్రము

గమనింపక, ధనమునే ప్రధానముగ నెంచుచున్నారు. పిల్లల తల్లిదండ్రులు తమపిల్లలకు ప్రపంచజ్ఞాన మినుమంతయు లేక యజ్ఞానాంధతమస్సులో నున్న లేత వయస్సులయందే వారి వివాహములకుగాను ప్రతివారితోను బేరములు సాగింతురు. ఎవ రెక్కువధనము నిత్తురో వారికే తమపిల్లల నిత్తురు. ఈవిధముగ వారు ధనమునే ప్రధానముగ గొని తమకన్యకలయొక్క సౌఖ్యము నినుమంతయు గమనింపక నెట్టివయోవృద్ధులకైనను ధనమునకై తమపిల్లల నమ్మివేయుదురు." ఇట్లు చేయుటవలన నాపిల్లలయొక్క భావి జీవిత మంతయు బహుదుఃఖప్రదమై పోవుచున్నయది. ఇట్టి ఘోరదురాచారపిశాచమును మనసంఘమునుండి పారద్రోలుటకు నాధునికవిద్యావంతులును, యువతీయువకులు పాటుపడవలసియున్నది. ఈవిషయమై ప్రస్తుతము ముఖ్యముగా నవివాహితులగు యువకులు తమభార్యల నెన్నుకొనుటలో నీక్రింది ముఖ్యవిషయములను పాటింపవలసియున్నది :—

ఆధునికయువకులు తమకు ప్రపంచానుభవము బాగుగ గలిగి, తల్లిదండ్రుల ధనముపై నాశించియుండక, తమస్వశక్తిపైననే ధన మార్జింపగలుగు సామర్థ్యమును గడించి, తమ వివాహములకు దామే ధనవ్యయమును జేసికొనగలుగునంతటి శక్తి యలవడినతదుపరి తమ 20 లేక 25-వయేట తమకు దగిన సద్గుణసంపన్నలగు యువతులను పాణిగ్రహణ మొనర్చుకొనవలయును. కట్నములకుగాని కానుకలకుగాని వారేమాత్ర

మోశపడకూడదు. చిన్ననాటనుండియు దురభ్యాసములు, దుర్వ్యయములు మొదలయిన వ్యసనములందు జిక్కుకొనక, తమభావిసంసారచక్రమును నడుపగలుగు మితవ్యయవిధానమును జక్కగా గుర్తించి ప్రవర్తింపవలయును. ఆటుపైని తమకు తాము స్వయముగ దమభార్యలను బోధింపగల మనుధైర్యము బాగుగ నుండినపుడే తమకు దగిన భార్యల నెన్నుకొనుటకు బ్రయత్నింపవలయును. యువకుడు కేవలము యువతియొక్క కృత్రిమస్థూల సౌందర్యమునకు ముగ్ధుడు గాకుండ, నామెయొక్క శీలమును గుఱించి బాగుగ పరికింపవలయును. తనకు గాబోవు భార్యయొక్క యాడంబరయుతములగు దుస్తులనుగాని, ధనమునుగాని చూచి వివాహమాడ నాకాత్రింపకూడదు. నిరాడంబరమగు దుస్తులతో, నిరాడంబరజీవనము గడుపునటువంటియువతియే యువకునికి దగిన భార్య కానోవును. ఆడంబరయుతమగు దుస్తులను ధరించి, సకలాభరణభూషితురాలై, మొగమునకు పౌడరు పూసికొని, సగర్వముగ దారివెంట బోవుచు, వికిలినవ్వు నవ్వుచు, కృత్రిమవిలాసదృక్కులను బఱపుచు నీవిధముగ కృత్రిమసౌందర్యమును డోలకాడజేయు యువతులు కొంతమంది ప్రస్తుత మనేకమంది యువకులమనంబుల నాకర్షించుకొనగలుగుచున్నారు. అట్టివారి కృత్రిమసౌందర్యాడంబరమునకు మోసపోయి, యిప్పటియువకులు వారిని ప్రేమించి వివాహమాడుట కిచ్ఛగింతురు. అట్టివారి భావిసంసారజీవితమును, ప్రేమానురాగములునుగూడ కృత్రిమ

పూరితములై యుండును. అట్టిపై పటాటోపమును జూచి యువకు లెన్నడును భ్రమింపరాదు.

బాలికలయొక్క తల్లిదండ్రులు తమ బాలికలకు చిన్న నాటనుండియు గృహవిద్యను నేర్పవలయును. అనగా గృహమునకు సంబంధించిన విషయము లన్నియు జక్కగ గుర్తెఱింగి వారికి బోధించుచుండవలయును. చిన్నప్పటినుండియు వారిశరీరపోషణమువిషయమై శ్రద్ధ తీసుకొనవలయును. శరీర దార్ఢ్యము లేని స్త్రీలందఱును భార్యలుగా నుండుట కేమాత్రమును తగినవారు కాజాలరు. పవిత్రమాతృత్వస్థానమున కనర్హులు. అట్టిదుర్బలు లగు స్త్రీలను పురుషులు వివాహమాడినయెడల వారికాపురము చాల కష్టయుత మగును. గృహకృత్యముల నన్నిటిని నిర్వర్తించుటయందు ఆమెకు శక్తిచాలక, కట్టో బలవంతముగ వాని నొనర్చుచు నచిరకాలములోనే తనయారోగ్యము సంపూర్ణముగ జెఱచుకొని మంచము పట్టి, దీర్ఘకాలరోగముచే బాధపడును. మఱియు నట్టిబలహీనులగు గృహిణుల కెల్లప్పుడు దశాంతి, చిరాకు, కోపము మున్నగునవి యావేశించి సదా గృహకల్లోలమునకు దావొసంగును. దానివలన కేవల మాస్త్రీ యారోగ్యము చెడుటయేగాక, అట్టిభార్యవలన పురుషునికిగూడ మనఃక్లేశ మావిర్భవించి, సదా నిరుత్సాహవంతుడును, భగ్నహృదయుడు నై చింతాక్రాంతు డగును. అట్టిచో వారిద్దఱికి జనించు పిల్లలుగూడ మిగుల దుర్బలులై, తల్లిదండ్రుల

యారాటమును మఱింత హెచ్చించెదరు. ఈవిధముగ శరీర దార్ఢ్యము లేనట్టియు, ఆరోగ్యహీను లగునట్టియు స్త్రీలను వివాహ మాడినచో వారికుటుంబమంతయు బహుదుఃఖభాజ కమై, దురంతచింతాబ్ధిలో నీదులాడుచుండును.

ఇంతియేగాక కొందఱుతలిదండ్రులు తమపిల్లల కెక్కడ వివాహము కాకపోవునో యని భయపడి, తమపిల్లల కుండిన లోపములను కప్పిపుచ్చుట స్వభావసిద్ధము. ఇట్లు చేయుటవలన నట్టిపిల్లలకు వివాహ మయినతర్వాత సంసారజీవితము మఱింత దుర్భరమై, తుదకు ఆత్మహత్యలకుగూడ కడంగుదురు. కావున తల్లిదండ్రులు వ్యాధిగ్రస్తురాండ్రగు తమపిల్లలకు వివాహము చేయకుండుటయే మేలు. ఉదాహరణమునకై క్షయవ్యాధిని గైకొని చూడుడు. ఈక్షయవ్యాధి సర్వసాధారణముగ నూపిరితిత్తులలో గలుగును. పిదప క్రమేణా యెముకలకును, నరములకు నెగబ్రాకి సర్వావయవములను దుర్బలస్థితికి గొనివచ్చును. ఈరోగము తరతరములవఱకును వ్యాప్తి నందగలదు. కావున నిట్టిరోగమును గలిగిన స్త్రీలను పురుషు లెన్నటికిని వివాహ మాడరాదు. వివాహమునకు ముందు తమకు కాబోవు భార్యయొక్క రూపరేఖా విలాసాదులను శీలమును బరీక్షించి తెలిసికొనుటయేగాక యట్టిరోగములను గుఱించి గూడ విచారింపవలసియున్నది. ఈవిచారణ చేయునపుడు ఆపిల్లకుగాని, లేక వారితలిదండ్రులకుగాని, లేక వారి కుటుంబములోనివారి కెవరికైనగాని మందుల నొసంగి చికిత్స

చేయు కుటుంబవైద్యుని యడిగి తెలిసికొనవలయును. కాని యావైద్యుడు నిజము చెప్పుటకు వెనుకాడుచున్నట్లు తెలిసిన చో నాపిల్ల కట్టివ్యాధి కలదని తమకు బాగుగ దోచినచో నాపెను వెంటనే స్త్రీవైద్యురాండ్రచే పరీక్ష చేయించి తెలిసికొనవలయును. లేనిచో నాపిల్లయొక్క తల్లిదండ్రులు గాని, లేక మృతిజెందిన తాతలుగాని తమజీవితములను భీమా చేసినట్లు తెలిసినయెడల, యాభీమాకంపెనీ వారిని సంప్రదించిన, యథార్థము గోచరింపగలదు. అట్లు చేయక త్వరపడి యట్టివ్యాధి గల స్త్రీలను వివాహ మాడినచో తమకే గాకుండ తమపిల్లలకుగూడ నంటును. ఈవ్యాధి తమకు గాబోవు [illegible] కుటుంబములో నెవరికైన నున్నదని తెలిసినచో నట్టియువతిని బాగుగ బరీక్షించి వివాహమాడుట యోగ్య మగుపద్ధతి. మఱియును తనకంటె, దనకు గాబోవు భార్య, శరీరదార్ఢ్యమునందేమి, వయసునందేమి మిన్నయైనచో నట్టి యువతినిగూడ వివాహ మాడరాదు. అట్టిభార్యతో సంసార సుఖ మనుభవించినయెడల, యువకుని యొక్క శక్తికంటె యాపెయొక్క శక్తి మించియుండుటచే నచిరకాలములోనే, యావచ్ఛక్తిని యాపె యాకర్షించుకొనగలదు. అట్లే యువకుడుగూడ యువతికంటె మితిమీఱిన బలసంపన్నత్వము గలవా డగుచోగూడ నట్టియువతియొక్క శక్తిని యాకర్షించుకొనును. కావున నీవిషయమునుగూడ గమనింప వలయును.

పిమ్మట ఇంకొకముఖ్యవిషయమును బాగుగ గమనింప వలసియున్నది. గృహిణి కుండవలసిన సుగుణములలో ప్రప్రధానమైనది తెలివితేటలు. తెలివిమాలిన స్త్రీ యైనచో నట్టి భార్యవలన పురుషునియొక్క సంసారజీవిత మేమాత్రము జక్కబడనేరదు. తెలివితేట లనగా సంగీతము పాడుటయందును, చిత్రవిచిత్రములగు కుట్టుపనులను చేయుటయందును, నవలలను చదువుటయందును గల ప్రావీణ్య మను నర్థము కాదు. అట్టివారు స్థూలసౌందర్యమును గలిగి తద్ద్వారా తమ భర్తల స్థూలదృష్టి నాకర్షింపగలుగుటకు మాత్రమే తగియుందురు కాని తమ భర్తలయొక్క కష్టసుఖములందు, ఆర్థిక క్లిష్టసంఘటనములందును నేమాత్రము సహాయకారు లగుటకు దగియుండరు. అట్టివారు తమభర్తల కట్టియెడ నించుమించుగ శత్రువులే యగుదురు. కావున నట్టి తెలివితేటలు, సంసారజీవనమును సుఖప్రదముగ జేయుట కుపయోగకారులు కాజాలవు. గృహిణి కుండవలసిన లక్షణములు తెలివితేటలు గృహమును ఆరోగ్యవంతముగను ఆనందకరముగను జేసి, భర్తకు మనోల్లాసమును గలుగజేయు నట్లుగ నుండవలయును. తనభర్తకు వచ్చు స్వల్పాదాయముతో సంసారమును క్లుప్తముగ గడుపుచాకచక్యమును గలిగియుండవలయును. ఆభరణముల కొఱకును దుస్తులకొఱకును భర్త నెన్నడును కష్టపెట్టరాదు. ఒకవేళ తనభర్త తనకు వచ్చు నాదాయముకంటె నెక్కువ వ్యయపఱచుచున్న యెడల తనమృదుమధురవాక్కులతో నాత

నికి నచ్చచెప్పి యట్టియధికవ్యయమును తగ్గించునట్లుగ బోధింప వలయును. శిశుపోషణావిధానమును గర్భశాస్త్రపరిచయమును గొంతవఱకు గలిగియుండవలయును. విద్యాగంధము ముఖ్యావసరమైయున్నది. లేనిచో నట్టిగృహిణి వట్టిమూర్ఖురాలై యనేక తెలివిమాలిన కృత్యముల నాచరించుచు తద్ద్వారా భర్త కక్కడలేని మనోవ్యాకులమును దెచ్చిపెట్టుటకు హేతుభూతురాలగును. కాని యావిద్య యిప్పటియాంగ్ల విద్యాపద్ధతుల పై నగాక, సక్రమయాదర్శప్రాయము లగు పద్ధతులపై ననే గఱపబడవలయును. పూర్వపు పతివ్రతామణుల పుణ్యచరిత్రలను, వీరనారీమణుల యద్భుతకథనములను వారిచే బఠింపించ వలయును. వారిలో నైతిక, యాధ్యాత్మికజీవితనైర్మల్యమును బెంపొందింపజేయునట్టి గ్రంథములే యుండవలయును. తరువాత, భర్తలవిషయములో భార్యలు, తాము వారికి నాజన్మాంతము సహధర్మచారిణులై, తోడునీడలై, కష్టసుఖముల యందును, సుఖదుఃఖములయందును గూడ వారితో బాలుగొనవలసియుండును. తమవల్ల తమభర్తల కేవిధమైన మనఃక్లేశముగాని కలుగునట్టి కార్యముల నాచరింపరాదు. భర్త మనోవ్యాకులముచే బాధపడుచున్నప్పుడును, తదితరములైన వ్యవహారపుచిక్కులలో దగుల్కొని విచారించుచున్నప్పుడును నతని కానమయమునందు గల్గు విచారమును బోగొట్టగలుగు శక్తి భార్యకడ నుండవలయును. తనప్రవర్తనలోను, శీలములోను నేవిధమైన యనుమానము నుదయించు నవకాశ మాతని కిష్ట

రాదు. అత డొకవేళ దన్ననుమానించునట్టి జాడలు కనబడి నచో వెంటనే యట్టియనుమానకారణము నాతనిని ప్రశ్నించి, గుర్తెఱింగి, యాతని కాయనుమానమును సంపూర్ణముగ బోగొట్టవలయును. ఈవిధముగనే, భర్తప్రవర్తనమునందు దన కు సందేహము పొడసూపినచో, నిర్భయముగ, క్రోధ మణు మాత్రమును లేకుండ దనసందేహము నతనికి దెలియపఱచి, యట్టిసందేహనివృత్తిని జేసికొనవలయును. ఇప్పటి గృహిణు లలో గొందఱు తమకృత్రిమములైన మృదుమధుర వాక్చా తుర్యముచేతను, విలాసదృక్కులచేతను, వింతచేష్టలచేతను, వివిధవర్ణోపేత భూషణాంబరములచేతను దమభర్తలు దమ్మె క్కుడుగ బ్రేమించునట్లొనరింపవలయు నను మూఢవిశ్వాస ముతో నావిధానముల ననుకరింప బ్రయత్నించుచున్నారు. ఈయాడంబరములవలన తమభర్తలకు దమపై నిక్కువమగు ప్రేమానురాగము లుదయించుటకు బదులు చంచలమైన ట్టియు, తాత్కాలికమైనట్టియు ప్రేమభావమే యుదయమగు చున్నది. ఈయాడంబర మంతటిని గాంచినచో సాధారణముగ భర్తలయొక్క స్థూలదృష్టికి దమభార్యలు రంభలవలెనే కాను పించుచుందురు. కాలక్రమేణా వారల కట్టియాడంబరయుతము లగు విలాసములయభిరుచి స్థిరీకృత మగును. అట్టిచో దమభా ర్యలకంటె నెక్కువవిలాసదృక్కులను, చేష్టితములను, భూష ణాంబరములను ధరించి, యెక్కువయాడంబరమును దొలుకాడ జేయు నితరస్త్రీలచే నాకర్షింపబడుదురు. ఈవిధముగ వారిలో

బహుతుల్యమగు కామేచ్ఛ పిచ్చిపెరిగి, విషయలోలురై, యనేక వ్యాధులకు లోనై, దుర్వ్యసనిపరు లగుదురు. కావున నీ విషయములను బాగుగ గుర్తించి గృహిణులు సత్ప్రథావర్తులు, నిరాడంబరజీవనులు నై తమభర్తలను దమ్ము పవిత్రప్రేమ భావముతో జూచుకొనునట్లు చేయవలయును. ఈసందర్భమున ప్రాచీనకవి, గృహిణి యగు భార్య కుండవలసిన ముఖ్యావశ్యములగు లక్షణముల దెల్పుచు నీక్రిందివిధముగ వాక్రుచ్చెను:—

శ్లో. కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
  రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ
  భోజ్యేషు మాతా శయనేషు వేశ్యా
  షట్కర్మయుక్తా కులధర్మపత్నీ ”

కావున నాధునికయువకులు తమభార్యల నెన్నుకొనుటకు ముందు వారియొక్క స్థూలశరీరసౌందర్యమును జూచి భ్రమింపక, వారి గుణగణములను, సత్ప్రవర్తనను, ఆరోగ్యమును గుఱించి బాగుగ దెలుసుకొనినపిదపనే భార్యలుగా బడయవలయును. అట్టియెడ నట్టిభార్యాభర్తల దాంపత్య మెంతయు ననుకూలమై, సుఖప్రదమై యొప్పగలదు.



# స్త్రీపురుషులు—

## వారి జాతిలక్షణములు



తొలుత బ్రహ్మదేవుడు తనసృష్టిని నిరాటంకముగ కొనసాగించు దృఢసంకల్పము గలవాడై, యాసంకల్పాతిశయఫలితముగ మన్మథుని బుట్టించి, యతనిని స్త్రీపురుషాదుల ప్రేమ కధిష్టానదేవతనుగ జేసెను. నాటినుండియు నీశి వణి కామన్మథుడు తనపూవుటమ్ములను స్త్రీపురుషాదుల యిరువురి హృదయములయందును గాఢముగ నాటజేసి, త ద్ద్వారా వారిరువురికి నొకరిపై నొకరికి ప్రేమానురాగములు ప్రవర్ధమానము లగున ట్లొనరించి, వారిరువురి సంయోగము వలన ప్రజోత్పత్తిని నిర్విఘ్నముగ సాగింపగలుగుచుండెను.

అటుపైని కొంతకాలమునకు, నాగరక మననేమియో యెఱుగని కాలమున స్త్రీపురుషాదులయం దొకకట్టుబాటు, నియమము, పాపపుణ్యములు, మంచిచెడ్డలు, దయాదాక్షిణ్యములు శూన్యములై, పశుతుల్యమగు కామోద్రేకమునకు వశులై, విచ్చల విడిగ సంచరింప ప్రారంభించిరి. అప్పుడు స్త్రీలపొందుకొఱకు పురుషు లొకరితో నొకరు పోరాడి,

యనేకఘోరహత్యలను చిత్రవధలను గావించుచుండిరి. అప్పటి వాతావరణమంతయు బహుభీభత్సయుతమై యుండెడిది. అట్టియెడ జ్ఞానులును తపోనిష్ఠాగరిష్ఠాత్ములు నగు మహామును లట్టి దృశ్యములను జూడజాలక వారిలో నొకవిధమగు కట్టుబాటొనరింప నిశ్చయించి, వివాహధర్మమును సుస్థాపిత మొనర్చిరి.

ఇట్లు దినములగొలది స్త్రీపురుషాదులలో నాగరకత వ్యాపింపదొడగెను. ఆపయిని వారిసంయోగ విధానములందు బహుతుల్యవిధానముల నడంచి సక్రమ విధానముల నేర్పఱచి, తద్వారా సత్సంతానమును బడయగలుగునట్లు జేయుటకు వాత్స్యాయన బాభ్రవ్య, కూచిమార, నందికేశ్వర, గోణికాపుత్రాదులు కొన్ని సక్రమవిధానముల నుదహరించుచు కామశాస్త్రమను నుత్కృష్టగ్రంథమును రచియించిరి. అందు స్త్రీపురుషాదులను గొన్నిజాతులక్రింద విభజించుచు వారివారి లక్షణములనుగురించి స్పష్టీకరించుచు నేయేజాతిపురుషు డేయేజాతిస్త్రీని వివాహమాడవలసినదియు బూస గ్రుచ్చినట్లు స్పష్టముగ విశదీకరించిరి. ఈక్రింద గొన్నిముఖ్యములగు జాతులను తల్లక్షణములను చేర్కొన గడంగెదము. ఆజాతులలో ముఖ్యము లగునవి పురుషులలో నాలుగుజాతులును స్త్రీలలో నాలుగుజాతులును గలవు. అయ్యవి, భద్ర కూచిమార పాంచాల ఉత్తాదులును, పద్మినీ చిత్రిణీశంఖినీహస్తినీ మొదలగునవియు వరుసక్రమమున నొప్పియున్నవి.

వీనిలో ప్రథమమున భద్రజాతిపురుష లక్షణముల గుఱించి వివరింపగడంగెదము:—

భ ద్ర జా తి పు రు ష ల క్ష ణ ము లు :—

సీ. అతిబలసంపన్నుఁ డభిమాని పృథుకాయుఁ
డరుణనేత్రుఁడు క్రోధి యతులతేజుఁ
డతివిశాలంబగు నాస్యంబు వక్షంబు
గలవాఁడు వక్రోక్తిఁ బలుకువాఁడు
నార్ద్రదేహుఁడు దాత సత్యవాక్యరతుండు
బవిరిగడ్డమువాఁడు బల్లిదుండు
సాహసాంకుఁడు దాత సత్యవాక్యరతుండు
మేరుధీరుఁడు రాగమేదురుండు
వళులుగలవాఁడు పొడవగు పొండుమేన
రోమములు చాలగలవాఁడు రూఢి జెందు
భద్రపురుషుం డనంగ విభ్రమముతోడ
విక్రమార్కుఁడు మొదలగు వీరవరులు.

కూ చి మా ర జా తి పు రు ష ల క్ష ణ ము లు:—

సీ. సమబలుఁ డతిఖర్వుఁ డమలనేత్రుఁడు కామి
ద్యూతపరుండు నిమ్నోదరుండు
అతినీలవర్ణుండు మతిశాలి తంత్రజ్ఞుఁ
డధికమత్సరి మూర్ఖుఁ డల్పరతుఁడు
మర్యాదలేమి సమ్మతముగాని యతండు

నాస్తికుండు కోపి ప్రస్తుతవాక్యుండు
కూచిమారుఁ డనఁగఁ గొమరుఁ జెందు.

పాంచాలజాతిపురుషలక్షణములు :—

సీ. ప్రాకరుణాశాలి యతిధర్మనిష్ఠుండు
ప్రియవాది మితవాది భీరహితుఁడు
నిండుచందురు నవ్వు నెమ్మోము గలవాఁడు
వెడఁదకన్నులవాఁడు వినుతయశుఁడు
ఆజానుబాహుండు రాజలక్షణశాలి
మత్తమాతంగసమానయాయి
నిమ్మపండువితాన నెమ్మేను గలవాఁడు
యరయుండు
గలుగువాఁడు మేను చులకన గలవాఁడు స
త్కర్మరతుఁడు సత్యతత్పరుండు
విక్రమించునెడను వీరాధివీరుండు
పూజితుండు
గీ. దేవతాగురుపూజలఁ దేలువాఁడు
ఏకపత్నీవ్రతుండు వివేకశాలి

దానమును సుబ్బువిద్యయుఁ దనరువాఁడు
పురుషవర్యుఁడు పాంచాలపురుషుఁ డగును.

దత్తజాతిపురుషలక్షణములు :—

సీ. అలసుఁడు మత్సరి యతిశయధృతిమంతుఁ
డల్పబలుండు మిథ్యాగుణుండు
అతిదంభయుతుఁడు విహారశీలుఁడు కామి
కుటిలచిత్తుఁడు రక్తకుంతలుండు
అతికృశదేహుండు వితతాధరాంగుండు
కూచిగడ్డమువాఁడు కుత్సితుండు
చెక్కుల బొమ్మునఁ జేతుల రోమముల్
మొలవనివాఁడు సమున్నతుండు
మఱపుగలవాఁడు చింతల మలయువాఁడు
కర్కశాంగుండు దుర్నీతిఁ గల్గు వాఁడు
కృపణచిత్తుండు మందుండు విపులకేశి
దత్తుఁడని పల్కఁబడియె సమ్మతముగాఁగ.

ఇక స్త్రీజాతులలో ముఖ్యములగు పద్మినీ చిత్తినీ శంఖినీ హస్తినీజాతిలక్షణములగుఱించి యీ క్రింద జేర్కొనెదము —

పద్మినీజాతిస్త్రీలక్షణములు :—

సీ. నిండారు నినుకతిన్నెలఁ బోలు పిఱుదులు
విరుగండ్లఁ బోలిన చిరుతగంప్లు
అర్ధముఖంబై సున్నని యున్న

వళు లొప్ప నరచేతివంటి బోటు?
తామరమొగ్గవిధమైన
నబ్జగంధము గల్గు నచటి
నునుబంగరుఁటుల నెనయు పెందొడలును
పూబంతికాంతినిఁ బోలు జాలు
లంపషాదియులు చిరుతొడ లబ్జములను
గేరుపదములు రాయంచ గేరు నడుపు
మృదుశిరీషసుమంబుల నేలు మేను
గలుగు పూబోఁడి పద్మినీకాంత యయ్యె.

మఱియును

సీ. దేవతాభక్తియు దీనులయెడ దయ
సరసిగ్గు పలుకుల నేర్పు గలిగి
పలుకాడునంతనే పొలయుట్క రోరుపు
కలహంస లులికెడు నెలుఁగు గలిగి
తెల్లనిపూవులు తెల్లనివస్త్రముల్
సవరించు కొద్ది భోజనము గలిగి
కుందనమ్మువితాన నందమా మైచాయ
నల్లగల్వల నవ్వుఁజాలు చాయ
గలిగి షోడపును బొట్టియుఁగాక వ్రతము
లాచరింపుచు సాధ్వియై యధిపునందుఁ
బ్రేమఁ గల్గిన యొలనాఁగ నేమ మమరు
పద్మినీకాంత యననొప్పుఁ బ్రస్తుతింప.

క. ఋతుమతియై యుండ మధు
వ్రతములగుంపు పయిఁ గ్రమ్మి పరిమళము గ[illegible]
సతి మేన జెమరించినచో
బ్రతి యేది సహస్రపత్ర వాసన నిండున్.

చిత్తినీజాతిస్త్రీలక్షణంబులు :—

సీ. పలుచని దేహంబు బటువైన నెమ్మోము
చపలదృక్కులు శిల్పచతురతయును
కొదమతుమ్మెదగుంపుఁ గదలించు నెరికురుల్
పొడవైన సంపెంగఁబోలు ముక్కు
బలిసినకుచములు భారంపుబిరుదులు
నతికృశమై యుండునట్టి నడుము
మిక్కిలిలావును మిక్కిలిసన్నంబు
గాని నెమ్మేను నుత్కటరతిచ్ఛ
మొల్లమొగ్గలట్లు పొడవైన దంతముల్
చివురుజొంపమట్లు తొవరుమోవి
పోకబోదెరీతి పొలుపైన కంఠంబు
సన్నమైన కాకజంఘ లమరి.

సీ. నెమలికుత్తుకఁబోలు నీటుకంఠధ్వని
సంగీతమందునఁ జాలఁ బ్రేమ
పొడవగు దేహంబు కడుస్థూలమునుగాక
విరళమౌ రోమముల్ వెలుపు గల్గి

నతిమృదువై యూర్ధ్వమై చెలంగు

మరునియుదకంబు తేనియ యొఱవు వెగటు
వెలయుఁ జిత్రాంబరంబుల ప్రేమ గల్గి
మొదటిజాముసఁ గలయుచు మోదమందుఁ
జిత్తినీ కాంత యెంతయు జిత్రముగను.

శంఖినీజాతిస్త్రీలక్షణములు :—

సీ. శిరమును బాహువుల్ నెరయ దీర్ఘమ్ములై
కృశముల్లై యుండు నారికుచము
లల్పములై యుండు నటువలెఁ గాకున్న
లంబమానములు నితంబయుగము
ఘనము పాదములు దీర్ఘములు దట్టము లై
తనువును శిరమునుఁ దగుకచములు
లోవంపుదేహము భావింప స్థూలంబు నై
ప్రాఁగుచుండు నేయవసరమున
ఘుర్ఘురస్వరంబు కుత్సిత నడకయు
భూమి యదర వేగముగఁ జరించు
కుటిలమైన చూపు క్రూరమైన మనంబు
కొండెములను పల్కుచుండు నెపుడుఁ

సీ * * * ప్రీతి చాలఁ గల్గినయది
నెలవంకగుంపులు నిండఁగోరు

కోరికల్ మిక్కిలి కోయ నెట్టినిపూవు
　వెట్టినివస్త్రము లిచ్ఛయించు
పచ్చవర్ణం బొండె హెచ్చుధూసరకాంతి
　యొండె కలిగినది రెండొండె ప్రకృతి
దయలేనియది మట్టి తలఁప భోజనము

*　*　*　*

అచటిరసమును కాఠోరమయ్యె వెగటు
గంధమును గలియుండుఁ దాఁ గరగినేని
వేగమే ప్రీతిఁజెందు నివ్విధము గలది
శంఖినీకాంత కామశాస్త్రంబునందు.

హస్తినీజాతిస్త్రీలక్షణములు:—

సీ. మిక్కిలి స్థూలంబు మేనుపొట్టియు దల
　వెంట్రుక వెట్టినై వెలయు గళము
కుదిసి లావై యుండు క్రూర నిర్దయురాలు
　పదము లంగుళములు వక్రము లగు
బిరుసు మే నతిమంద మరయ యానము నెట్టి
　నైన వర్ణము గొప్పదైన మోవి
ఏనుఁగు మదమున కెనయైన
　మేని చెమ్మట నవ్విధాన నమరు
తలుచు నల్లనిరుచి మేనఁ దనరుఁ జాల
భోజనము సేయు గాద్గదత్వమును వహించు

కంఠనాదంబు రతియందు కష్టసాధ్య
హస్తినీకాంత వలఁపుల నాన సేయు.

ఈవిధముగ నాయాజాతులయొక్క లక్షణవివరము లను దెల్పుచు నేయేజాతిపురుషు డేయేజాతిస్త్రీని వరించు నదియు, నేయేజాతిస్త్రీ యేయేజాతిపురుషుని వివాహమాడు నదియు విశదీకరించుచు ఈసందర్భమున నీక్రింద కొలదిగ సూచింపబడెను:—

క. ఈపద్మిని పాంచాలుని
దాఁ బరిణయ మగునుగాని తలపోయంగా
నేఁట్టునవయినన్ గన
దేవరుషుల వలచియుండ దీలోకమునన్.

క. తనమనసు నీచు దొక్కరి
మన నవలీల గ్రహించు మమత యధికమౌ
తనియు నతివేగమున ముద
మొనరగ రతి భద్రజాతిపురుషుని వలనన్.

శంఖినీజాతి లక్షణములను గలిగిన స్త్రీ యేజాతిపురుషుని వరించునదియు నీక్రింద నుదహరింపబడినది:—

క. రాతిరిమూఁడవజామునఁ
బ్రీతివహింపం దలంచుఁ బ్రియతమునిపయిన్
ఏతతి శంక వహించున్
జేతోగతి గూచిమారుఁ జేరి రమించున్.

హస్తినీకాంతయొక్క వలపురీతి యిట్లుదహరింపబడెను:-

క. అర్ధనురేయిని రతిచే
నొద్దిక రమియించు వెండియుం బ్రియ మమరన్
ముద్దియ మధ్యాహ్నంబున
ముద్దు గనన్ భద్రజాతి పురుషునివలనన్.

ఈవిధముగ స్త్రీపురుషజాతిలక్షణముల దెల్పుచు, నేయే జాతిస్త్రీ యేయేజాతిపురుషులను వరించుననియు పైనజెప్పినట్లు వర్ణించియున్నారు. ఇట్లు వర్ణించుచు నీస్త్రీపురుషజాతుల ననేక జాత్యుపజాతులక్రింద విభజించి యాజాతుల స్వభావమును జక్కగ విశదీకరించిరి. మఱియును వారివారి ప్రకృతిభేదములను, సత్త్వభేదములను విడమర్చి సాంగోపాంగముగ వివరించిరి. ఈవిధముగ స్త్రీపురుషాదుల జాతులను, వారి సంసారసౌఖ్య సక్రమవిధానములను నిర్ణయించుచు నాప్రకారముగ స్త్రీపురుషాదు లిద్దఱవలంబించినచో సత్సంతానమును బడసి యిహపరసౌఖ్యముల జూఱగొనగలుగుదురని చెప్పిరి.



# స్త్రీల ఋతుసంబంధమగు విషయములు



స్త్రీ యొక్క గర్భాశయములో నుండు దుష్టరక్త మంతయు ప్రతిమాసము వెలుపలికి స్రవించుచుండును. దీనికే ముట్టు అని పేరు. మనభారతదేశమందలి స్త్రీలు మన దేశమునం దుష్ణాధిక్యతగా నుండుటచేత సాధారణముగా 12 మొదలు 14 వత్సరములలోగా ప్రథమ రజోదర్శనము నందెదరు. మన దేశముకంటె నింకను అధికయుష్ణప్రదేశ మగు నాఫ్రికాలోని పడుచులు 9 వత్సరముల ప్రాయము మొదలుకొనియే ఋతుమతు లగుదురు. ఇక శీతల ప్రదేశము లగు నైరోపా మొదలగు దేశములలోని యువతులు 15 మొదలు 18 వత్సరముల లోపల రజస్వల లగుదురు. మఱియు నధికశీతలము లగు క్వీస్లాండు, రష్యా మొదలగు దేశములలో 20 మొదలు 22 సంవత్సరముల ప్రాయము వచ్చినప్పుడు ఋతుమతు లగుదురు. ఈ రజోదర్శన మొక్క దేశ శీతోష్ణపరిస్థితులనుబట్టిమాత్రమే గాక, కొంతవర కాయా యువతుల శరీరతత్త్వములనుబట్టి గూడ నుండును. తొలుత నీ రజోదర్శన మైనవెంటనే యిట్టి బాలలకు యుక్తవయస్సులు వచ్చిన వని యర్థము. ఈద్రవము ఎఱుపువర్ణమును నొక్కొక్కప్పుడు పసుపువర్ణమును మఱికొక

ప్పుడు మంటివర్ణమును గలిగియుండును. ఈవర్ణభేదములబట్టి యువతులయొక్క శరీరారోగ్యమును నిర్ణయించుకొనవచ్చును. ఈపై జెప్పబడిన వర్ణములుగాక, తెలుపువర్ణమును గలిగియుండినచో నట్టిపడుచులు వ్యాధిగ్రస్తులై యుండిరని తెలియు నగును.

ఇట్లు ప్రథమరజోదర్శనకాలము మొదలుకొని యారజోదర్శన మాగిపోవువఱకును స్త్రీలు సంతానవతు లగుగుణమును గలిగియుందురు. స్త్రీలు ముట్టగుట యెప్పుడు నిలిచిపోవునో యప్పటినుండియు వారికి సంతానము గలుగుటకూడ యాగిపోవును. ఈముట్టు, స్త్రీలు 45 లేక 50 ఏండ్లప్రాయము గలవారగుటతోడనే సాధారణముగ నిలిచిపోవును. ఈముట్టు స్త్రీలశరీరసౌఖ్యమున కెంతయు ముఖ్యచిహ్నము ఈస్రవము యొక్క ప్రమాణ మాయాదేహతత్త్వములపై నాధారపడి యుండును. మంచిదేహారోగ్యము గల స్త్రీల ముట్టుస్రవము 4పలముల బరువు గలిగి 4దినములలో వెలికి స్రవించును.

ఇట్లు స్త్రీలశరీరములలోనుండు దుష్టరక్తమంతయు ఋతుకాలమునందు వెలికి వచ్చి, వారిశరీరములకు మంచి యారోగ్యమును, సౌఖ్యము నొడగూర్చును.

ఈసందర్భమున సుప్రసిద్ధ ఐరోపియను వైద్యులగు డా॥ గ్రేగారు (Dr. Grey) ఋతువునుగురించి యీక్రింది విధముగ నుడివిరి:—

“స్త్రీలు ప్రతినెల ఋతుమతు లగుచో వారి శరీరమున కెంతయు నారోగ్యము కలుగును. ఈఋతువు ప్రతినెల స్త్రీయొక్క గర్భాశయమును శుభ్రపఱచి, తద్వారా శిశూత్పత్తి కెంతయు దోడ్పడుచున్నది.

డాక్టర్ డేవిస్‌గారు (Dr. Davis):—ఈముట్టు స్త్రీల యొక్క గర్భాశయములోని యతియుష్ణమును నివారించి వారికి శరీరసౌఖ్యము నియుపడింప జేయుచున్నది. ఇంతియేగాక స్త్రీలలో గలుగు పశుతుల్య మగు నపరిమితసంయోగవాంఛా ప్రాబల్యము నడంచుచున్నది. అని చెప్పిరి.

ఈవిధముగ నీముట్టునుగుఱించియు, దాని యొక్క ప్రయోజనమునుగుఱించియు ననేకమంది వైద్యశిఖామణు లెన్నియోభంగుల విశదీకరించియుండిరి. పూర్వము మన దేశమునందు ప్రాచీనమహాపురుషు లీముట్టునుగుఱించియు, ముట్టయినస్త్రీలు గమనింపవలసిన ముఖ్యవిషయములను గుఱించియు నీక్రిందవిధముగ దెల్పియున్నారు:—

“స్త్రీ, తనముట్టుకాలమునందు గృహమునుండి వెలుపలికి వచ్చి కొంతదూరముగ నుండవలయును. ఆసమయము నందు తన పెనిమిటితో సంసారసుఖమునుగాని, తత్సంబంధమైన సరసాలాపములనుగాని యెంతమాత్రము నెఱపగూడదు. పగటికాలములయందు నిదురింపరాదు. నదీజలములందుగాని తటాకములందుగాని మునిగి స్నానము చేయరాదు. అధికముగ

నవ్వుటయును, బరుగెత్తుటయును కూడదు. బిగ్గరగ మాటలాడ రాదు. భయంకరకృత్యములను గాంచుటగాని, భయంకరధ్వనుల నాకర్షించుటగాని కూడదు కఠినమైన పనిని జేయరాదు. చలిగాలిలో నుండరాదు. జీర్ణముకాని పదార్థములను భుజింప రాదు. ప్రతినెల ముట్టగుట నిలిచిపోయిన యెడల యప్పుడా స్త్రీని చక్కగా బరీక్షించినమీదట నయ్యది గర్భచిహ్నముగ నెంచ వలయును. ముట్టుకాలమునందు, స్త్రీలతో సంపర్కముజేసిన పురుషునియొక్క రక్తమంతయు విషప్రాయమై యతనికి ప్రాణాపాయము సంఘటిల్లును. అంతియేగాక నట్టిస్త్రీకి జనించు పిల్లలకుకూడ గొప్పకీడు వాటిల్లగలదు.

ఈపై జెప్పబడిన యంశములను, ఋతుమతులగు స్త్రీలు చక్కగ గమనింపవలసియున్నది. ఈసందర్భమున నొక వింత విషయము చెప్పవలసియున్నది. సాధారణముగ యువతులు 16 ఏండ్లవయస్సులోపుగనే పుష్పవతు లగుట సహజము. కాని కొంతమంది పుష్పవతులే కాకుండ నుందురు. అట్టివారికి మూచకన్యలని పేరు. ఇట్టివా రెద్దియో యొకరోగముచే బాధపడుచుందురు. ఆరోగమే యీముట్టును నిరోధించు చున్నది. ఇట్టివారికి ఆకలి మందగించుట, ఆయాసము, కష్టము పైన శ్వాసము పీల్చుట, సోమరితనము, నడుమునొప్పి మొద లగు దుర్గుణము లన్నియు నుండును. మఱియు వారి శరీర సౌష్ఠవముగూడ చెడిపోయి మిక్కిలి దుర్బలస్థితియం దుండును. పురుషులను జూచినచో చాలయసహ్యించుకొనియెదరు. వారికి

వివాహము జేసికొనకటయుందును, సంసారసుఖమునందును విరక్తి కలుగును. ఆయిచ్ఛయే వారి కుండదు. ఇట్టివా రను సరింపవలసిన చికిత్సావిధానములు బలవృద్ధిదములగు నౌషధ సేవనము, పరిశుభ్రమైన గాలిని పీల్చుచుండుట, పుష్టికరమైన యాహారమును భుజించుట, చల్లనినీటిలో స్నాన మొనర్చుట మొదలగునవి. మఱియు నువ్వునీటిని కాచి యొకతొట్టిలో పోసి నడుమువఱకు నొకయరగంటసేపటివఱ కందులో కూర్చుండవలయును. ఈవిధములగు చికిత్సలచే మాచకమ్మలు పుష్పవతులగుట కవకాశ మొదవును.

ఇక ఋతుమతులకు గలుగు సూతకపువ్యాధినిగుఱించి కొంతవఱకు దెలిసికొందము సూతకబంధ మనగా స్త్రీలకు నెలనెలకు గర్భాశయములోనుండి వెడలు దుష్టరక్తము సరిగా వెలుపలికి రాకుండుట. ఇయ్యది పుత్రోత్పత్తికి నడ్డుగా నుం డుటయేగాక స్త్రీలకు గలుగు ననేకవ్యాధులకు బుట్టినిల్లుగ నేర్పడుచున్నది. అయితే యీసూతకబంధపువ్యాధిని, నెల నెలకు ముట్టగుస్త్రీలకు ముట్టు నిలిచిపోవుటవలనను, లేక పుట్టిన బిడ్డకు పాలిచ్చునంతవఱకు నాగియుండుటవలన నిరూపింప రాదు. ఈరోగము పుట్టుటకు గారణము గర్భకోశము మామూ లుకంటె నధికశీతలముగ నుండుటవలనను, కఫ, వాతసత్తు, పిత్తసత్తు శ్లేష్మసత్తు మొదలగునవి యధికముగ నుండుటవల నను, శరీరమున రక్తప్రసారము తక్కువగుటవలనను నీసూతక బంధవ్యాధి యుద్భవ మగుచున్నది.

స్త్రీలకు నెలనెలకు ఋతువు వెలికి వచ్చునపు డధిక బాధ కలిగియున్నపు డట్టిది సూతకవ్యాధి యని నిరూపింప దగును. ఇట్టివ్యాధిచే బీడింపబడు స్త్రీలందఱు సర్వసామా న్యముగ, సంతానవిహీనలై, గొడ్రాండ్రని పిలువబడు దురు. ఇట్టివ్యాధియొక్క లక్షణములు, పొత్తికడుపునందు సహింపరాని యావేదన, అమితమగు కడుపునొప్పి, తలనొప్పి, వాంతులు మున్నగునవి. ఋతుస్రావము నల్లరంగును గలిగి, కల్మషపూరితమై వెలికి వచ్చును. ఈవ్యాధి, యధికోష్ణముచే గర్భద్వారములోని రక్తనాడులద్వారములు బంధింపబడుటచే గలుగుచున్నది. ఇట్టివారు ముట్టయినకాలమునందు ప్రతిది నము నుదయసాయంకాలములందు నొకతొట్టిలో వేడినీళ్లను పోసి, నడుమువఱకు నీరు వచ్చునట్లుగ, దానిలో గూర్చుండి యటు లొకయిరువది నిమిషముల కాలమువఱకు గూర్చుండ వలయును.

తర్వాత, స్త్రీలు ఋతుమతు లగుకాలమున, యట్టిఋ తువు ధారాళముగ వెలుపలికి స్రవింపక కొంతభాగము రక్త నాడులలోనే యిరుకుకొని నిలుచుటవలన «సూతికవృజన్ని» యను నొకవిధమైన వ్యాధి యుత్పత్తి యగును. ఈవ్యాధి వలన నరము నొప్పి, తీపు మొదలైనవి ప్రారంభించును. ఱొమ్మునందు నొకవిధమగు గుండ్రమైన బంతివలె, నేర్పడి, యయ్యది గొంతులోనికి పొడుచుకొని యున్నట్లు తోచును. ఇట్టివ్యాధిగల స్త్రీలు వెక్కివెక్కి యేడ్చుట, యున్నటులుండి

రొక్కసారి బిగ్గరగ నవ్వుట, యొక్కొక్కపుడు భయంకర ముగ నఱచుట, మున్నగు దుర్గుణములను గలిగియుందురు. అట్టిస్థితిలో వారు తమతలవెంట్రుకల నూఊక పీకికొనియెదరు. తాము ధరించియున్న యాభరణముల నన్నిటిని యూడలాగు కొనెదరు. పిమ్మట కొంతవఱకు నరములతీపి సద్దుకొనినచో నప్పుడు తమయేడ్పును గొంతవఱకు మానివై చెదరు. కొన్ని సమయములలో వారికి యొడతెగని వెక్కిళ్లు ప్రారంభ మగు ను. అప్పుడు వారికి గొంతసేపటివఱకు చూపి రాదక స్మృతివి హీనలై పడియుందురు. ఇట్టిస్థితిలో వారిశరీరములో నుండు చెడురక్తమును శుభ్రపఱచి, రక్తము నభివృద్ధిపఱచునట్టి యౌషధసేవనము, నాహారము వారి కవసరములు. మిక్కిగా నుండు స్థలములందును, ధారాళముగ గాలి చొఱనట్టి యిఱుకు ప్రదేశములందును వారిని పరుండబెట్టక, ధారాళముగ మంచిగాలి వీచునట్టి పరిశుభ్రమైన స్థలములయందు పరుండబెట్టవలయును. వారితో నిరుత్సాహకరమగు నేవిధ మగు సంభాషణలనుగాని నెఱపక, వారిలో నుత్సాహధైర్య ములు పురిగొల్పు మాటలనే యాడుచు, వారివ్యాధి నివారణ మగుచున్నట్లు వారికి ధైర్యమును గలుగజేయవలయును. ఇట్టివ్యాధి గల స్త్రీలు సంసారసుఖమునం దతిజాగరూకత గలిగి వర్తింపవలయును. తగిన వైద్యచికిత్సల నందవలసియుం దును.

స్త్రీలకు ప్రతినెల యేర్పడు ఋతుకాలమునం దట్టి ఋతుస్రావపరిమాణ మధికముగా నుండి, యధికకాలము

స్రవించుచున్నచో నట్టిది 'పెద్దపాటు' అనువ్యాధిలక్షణ మని యెఱుంగవలయును. ఈవ్యాధి యధికోష్ణముచే గలిగిన వాయువువలన నరముల బిగువు సడలుటచేతను, మితిమీఱిన భారములను మోయుటవలనను, అపరిమిత సంసారసుఖ మనుభవించుచుండుటచేతను కంఠమాల మూత్రాశయము గుండె మొదలగు వానియందు నొప్పి గలిగి గర్భాశయమునందు వ్రణ మేర్పడి, తద్వారా గలుగు బలహీనతచేతను, గలుగుచున్నది. వ్యాధికి తగు చికిత్సావిధానములు పలు తెఱగులు గలవు. వీనిలో ముఖ్యమైనది. లాక్టిక్ ఆసిడ్ (Lactic acid) అను నౌషధము నుపయోగించుట. ఈఆసిడ్ యొక్క యమూల్యప్రయోజనము ప్రాక్టికల్ మెడిసన్ (Practical medicine) అనుపేర శ్రేష్ఠ వైద్యపత్రికలో జక్కగ నభివర్ణింపబడియున్నది. ఈలాక్టిక్ ఆసిడ్ పెద్దపాటురోగము (Leucorrhea) నకు కారణభూతము లగు సూక్ష్మక్రిముల నన్నింటిని చంపి, వ్యాధిని పూర్తిగ నివారింపగల శక్తిని గలిగియున్నది. దీనిని యుపయోగింపవలసిన విధానము, 100భాగముల జలములో ½భాగము ఆసిడ్ పోసి కలుపవలయును. కాని వ్యాధి యంత యుపద్రవకరముగ లేని పరిస్థితులయందు 500భాగముల నీళ్లలో 1భాగము ఆసిడ్‌ను మాత్రమే మిళితము జేసి యొసంగుట మంచిది. ఎల్లప్పుడును నిట్టివ్యాధి గల స్త్రీలు స్వచ్ఛమైన గాలి వీచుస్థలములయందు పరుండవలయును. అధికముగ నడచుటగాని, కూర్చుండుటగాని

యెంతమాత్రమును పనికిరాదు. కడుపుపైననైనను లేక వీపు మీదనైనను మంచుగడ్డను నుంచుకొనవచ్చును. పటికారము కలిపిన జలమును వ్యాధిపీడితలగు స్త్రీలయొక్క మర్మస్థానములగుండా పిచుకారు చేయవచ్చును. ఇట్లు చేసినచో నట్టి వ్యాధి చాలవఱకు నివారణము కాగలదు.

ఈవిధమైన ఋతుసంబంధములగు వ్యాధులయొక్క లక్షణములు కొంతవఱకు స్త్రీలు ముఖ్యముగ దెలిసికొన గలుగు విద్యాగంధమును గలిగి తత్సంబంధమైన గ్రంథావలోకనమును గూడ కొంతవఱకు నెఱపుట యుత్తమము. ఈపై జెప్పబడిన వ్యాధులస్వభావము మనస్త్రీలలో జాలమందికి దెలియక, వానికి తగుమైన చికిత్సలు చేసి నిర్మూలించుటకుమారు నావ్యాధి తీవ్రరూపము దాల్చువఱకు తమతెలివిమాలిన చికిత్సలనే యొనర్చుచు నావ్యాధి నిర్మూలనమును మఱింత కష్టసాధ్యముగ నొనర్చివై చెదరు. కావున యీపైవిషయములను జక్కగా దిలకించి స్త్రీలీవ్యాధులయొక్క తత్త్వమును కొంతవఱకు దెలిసికొని, తన్నివారణార్థమై సకాలములో సక్రమచికిత్సలను బొందినచో వ్యాధి పూర్తిగ నివారణ మగును.



# స్త్రీ పురుషులు—

## సంతాన విహీనత



స్త్రీపురుషులసంసారసుఖమువలన శిశూత్పత్తి కలుగును. అట్టి శిశూత్పత్తి పురుషునియొక్కయు, స్త్రీయొక్కయు ధాతురజోసమ్మేళనమువలన నేర్పడుచున్నది. కాని కొంతమందికి యీశిశూత్పత్తి కలుగనే కలుగదు. బాహ్యముగ వారెంతటిశరీరపటిమ కలవారుగ గన్పించుచున్నను వారికి సంతానము కలుగకుండుట జూడ గొంతమందికి ఆశ్చర్యముగూడ కలుగుచున్నది. దీనికి గారణము నట్టిస్త్రీపురుషుల రజోధాతువులందు గల దోషమే. ధాతుదోషము గలిగిన పురుషుడు పురుషగొడ్డనియు, రజోదోషము గలిగిన స్త్రీ స్త్రీగొడ్డు అనియు పిలువబడుదురు. మఱియు నిట్టి గొడ్డుతనములో రెండువిధములు గలవు. అవి, స్వాభావికమైన గొడ్డుతనము, అస్వాభావికమైన గొడ్డుతనము. స్త్రీపురుషుల ప్రథమసంయోగము మొదలు వృద్ధాప్యమువఱకు వారికి సంతానము జనింపకున్నచో నట్టిది స్వాభావికపు గొడ్డుతన మని పిలువబడును. స్త్రీ గర్భాశయములందును పురుషుకోశములయందును గల నొప్పి, ధాతురజోసమ్మేళనమునందలి దోషములు, జననేంద్రియదోషములు, సం

యోగకాలమునందు స్త్రీపురుషాదు లవలంబించు విపరీత మార్గ ములు మొదలైనవానివలన సంతానము కలుగకుండ నుం డును. ఇట్టిది యస్వాభావికపు గొడ్డుతనము. ఈవిధముగా రెండు విధములు నిర్వచింపబడియున్నవి. ఇక పురుషగొడ్డుతనము స్త్రీ గొడ్డుతనములగురించి కొంతవఱకు ముచ్చటింతము :—

పురుషగొడ్డుతనము, పురుషులధాతువునందు నుష్ణ మధిక ముగ నుండుటవలనను శరీరము శుష్కించి దుర్బలస్థితియం దుండుటవలనను, దేహము స్థూలమై యెక్కువ క్రొవ్వుపదార్థ మును గలిగియుండుటవలనను పరిశుభ్రమైన రక్తప్రసారము విహీనమగుటవలనను శరీరమునందలి నరములపటుత్వము సడలి పోవుట, అనేకదినములు అధిక సంయోగతృష్ణార్తులై, అట్టి తమసంయోగతృష్ణను దీర్చుకొనక బహుదినములు గడుపుట వలనను, మేహరోగము కంఠమాల ముష్టిప్రయోగము మొద లైనవానివలన గోప్యాంగపు నరముల పటుత్వము క్షీణించి పోవుటవలనను సంభవించుచున్నది. కొందఱికి ధాతువునందు తీపి లేకపోవుట, ధాతువును వేడినీటిలో వదలినయెడల నయ్యది నీటపైననే తేలుచుండుట, అణుదర్శినిని పెట్టి చూచినయెడల నూపిరిలేని పురుగులు కనబడుట యీమొదలైన లక్షణముల వలనగూడ పురుషగొడ్డుతనమును నిరూపింపవచ్చును. మఱి కొందఱికి జననేంద్రియ సౌష్టవము చక్కగా పెంపొందక పోవుటవలనగూడ నపుంసకత్వ మేర్పడును.

ఇక స్త్రీ గొడ్డుతనమును నొకింత పరిశీలింతము. సాధారణముగ నీగొడ్డుతనము పురుషులలోకంటె స్త్రీలలోనే యెక్కువుగ గాన్పించును. దీనికి యనేక కారణములు గలవు. స్త్రీపురుషాదులు తమ సంసారసుఖ మనుభవించు కాలములో సక్రమ విధానముల నవలంబింపక పోవుటవలనను, వివాహమునైన ప్రారంభదశయందే యపరిమిత సంసారసుఖములో విలీనులై పోవుటచేతను, పురుషసంపర్కమైన వెంటనే స్త్రీ లేచి కూర్చుండుటచేతను నిలుచుటచేతను, సంసారసుఖమునకు పిమ్మట కఠినమైన పనుల నొనర్చుటచేతను, అపరిమితమైన వ్యసనమును గలిగియుండుటచేతను, భీతిచేతనుక్రాన్తై యుండుటచేతను స్త్రీకి యీగొడ్డుతనము సంప్రాప్త మగుచున్నది. మఱికొందఱు యొకరిద్దరు బిడ్డలను గాంచినంతనే మరల వారికి గర్భధారణము గలుగదు. దీనికి కారణ మట్టిస్త్రీలు అమితసంయోగవాంఛాపీడితులై, యమితసంసారసుఖము ననుభవించుటచే వారి గర్భాశయముయొక్క నోరు చెడిపోయి, సంతానము కలుగుట కవకాశ మొసంగదు. ఆట్టివారు బహిష్టుకాలమునందమితమైన బాధ నందెదరు. మితిమించిన తెలుపు కనబడుచుండును. కొందఱికి గర్భాశయము చెదరి వెలుపలికి త్రోసికొనివచ్చుటచేతను, గర్భాశయమునకు ముందుప్రక్క నున్న జవ్వ చినిగియుండుటచేతను, గర్భాశయములోనికి ధాతువును పోనీయక నిరోధించుచు కండరములు పెరిగి మూసికొనియుండుటచేతను, తెలుపుమేహము మొదలయిన రోగములచే

బాధింపబడి సంయోగానంతరము గర్భాశయముయొక్క నోరు ముడుచుకొనిపోయి చిన్నది యగుటచేతను, గర్భవృత్తిలో నుండి గర్భమునకు గొనిపోవు వాతకాళాయిలు చినిగిపోవుట చేతను, గర్భవృత్తి చినిగియుండుటచేతను, మేహము, తెలుపు, మేహపుపట్టు, మేహపుగడ్డ, మేహవ్రణములు, రక్తక్షీణము, నూతకబంధము, పెద్దపాటు మొదలైనవ్యాధులచేతను, గర్భాశయములో కండ పెరిగియుండుటచేతను, మితిమీరిన క్రొవ్వు వ్యాప్తమై యుండుటచేతను, గర్భాశయములో నధికోష్ణ ముండుటచేతను, అధికమైన శీతలము, అధికముగ వాత పిత్త శ్లేష్మము లుండుట మొదలగు ననేకవిధములైన కారణములచేత స్త్రీలకు గర్భములు నిలిచిపోవుచుండును.

మఱియు గర్భాశయములో నుష్ణ మధికముగ నుండుటచే తద్వారా యట్టి స్త్రీయొక్క రజస్సుకూడ నధికయుష్ణమును కలిగియుండును. అట్టిచో సంసారసుఖకాలమునందు పురుష ధాతువు నట్టిరజస్సుతో గలిసినయెడల నాధాతువులో శిశూత్పత్తి కారకములగు సూక్ష్మక్రిములన్నియు, రజస్సుయొక్క యుష్ణాధిక్యత కింధనములై మృతిజెందును. అట్టియెడ గర్భ ధారణమున కవకాశమే గలుగదు. ఇట్టి స్త్రీలకు దేహము నానాటికి శుష్కించిపోవుట, తిమ్మిరి మొదలగు చిహ్నములు కలుగును.

అట్లుగాక స్త్రీయొక్క గర్భాశయ మధిక శీతలమును కలిగియున్ననుగూడ నందులో జేరు ధాతువుగూడ గడ్డ కట్టిపోయి, గర్భధారణ కాటంకమును గల్పింపగలుగును. ఇట్టి స్త్రీలయొక్క దేహములు నల్లబారియుండును. వారు విసర్జించు మలమూత్రాదులుగూడ నలుపువర్ణమునే గలిగియుండును. మఱియు వీరిదేహములందు నశక్తి, భుజించిన యాహారము సరిగా జీర్ణము కాకపోవుట, ప్రాలుమాలిక మొదలగు దుష్ట చిహ్నములు కానుపించును.

గర్భాశయములో వాతపు నధికముగ నిండియుండుటవలన నానిలో జేరెడి ధాతువును నిరోధించుచు, వెలుపలికి ద్రోసివేయుచుండును. ఇటువంటి స్థితియం దుండిన స్త్రీలకు కడుపుబ్బరము, ప్రాణముపైన విరక్తి జనించుట, శరీరమంతయు శుష్కించి మిక్కిలి దుర్బలస్థితియందుండి నీరస మధికమగుట, రాత్రులందు పరుండినపుడు నిదుర సరిగా పట్టకుండుట మొదలైన దుర్గుణము లెన్నియో కానగును.

ఇక గర్భాశయములో శ్లేష్మజల మధికముగ జేరియుండుటవలన అందు జేరబోవు ధాతువును తనలోనికి జేర్చికొని యిముడ్చుకొనుటకు శక్తిచాలనిదై మిక్కిలి వాడిపోయి యొక మూల కొదిగియుండును. అట్టిచో నట్టిస్త్రీలకు గర్భధారణ మసంభవము. ఆసందర్భములో స్త్రీలకు, వారి ఋతుకాలము నందలి ఋతుస్రావము తెలుపురంగును గలిగియుండుట, ఉబ్బ

సము మలబద్ధము మొదలగు వ్యాధిలక్షణము లెన్నియో వ్యాప్తమై యుండును.

కావున పై జెప్పబడినయంశములయొక్క స్వభావమును ప్రతి స్త్రీపురుషులును గమనించి, వాని నివారణోపాయము లగు నారోగ్యవిధానములను జక్కగ గుర్తించి, ఋజుపథాను వర్తులగుచో వారికి సత్సంతానము కలిగి, వారిజీవితముగూడ కంటక విరహితమై యొప్పారగలదు.



# అమితసంయోగాసక్తి—
## దానివలనిదుష్ఫలితములు



ప్రస్తుతపు నవనాగరక ప్రపంచమందలి స్త్రీపురుషాదులయొక్క వర్తనము లెంతయు నమానుషములును, అవినీతికరములు నై యున్నవి. "Eat, Drink and Enjoy', అనెడి సిద్ధాంతము ననుకరించుచు మన దేశమునందు కొందఱు విచ్చలవిడిగ సంచరించుచున్నారు. మఱియు యిట్టి వీరిదుష్పథమునకు మార్గమును జూపునట్టి యనేకదృశ్యములు గ్రంథములు సాధనములు మొదలగునవి ప్రబలిపోయినవి. ఇట్టివానివలన వారిలో నింద్రియప్రేరేపణము హెచ్చుపెరిగి వారి యవయవములు సదా యుద్రిక్తావస్థయందుండును. అట్టియవస్థలో వారియందు దుర్భరమగు నావేదన ప్రభవించి చెప్పరాని మరణావేదన ననుభవించుచు నపరిమిత సంయోగాసక్తిని గలిగియుందురు. ఇట్టి యనవసర యింద్రియప్రేరేపణచేత వారి శరీరము లధికయుష్ణమును గలిగియుండును. ఇట్టి స్థితిలో స్త్రీపురుషులు తమ సంసారసుఖ మనుభవించుకాలములో మైమఱచి సక్రమవిధానములను గమనింపక యనేకకుమార్గముల నవలంబించి తమతమమర్మాంగములకు తీఱని యపా

యము యనారోగ్యము వాటిల్లజేసికొనియెదరు. ఇట్టి యపరిమిత సంయోగాసక్తి స్త్రీలలోకంటె బురుషులయందే మితిమీఱిపోవుచున్నవి. ఇట్టి దుష్టవాంఛా ప్రేరేపితులగు పురుషులయొక్క ధాతువు నీరుక్రింద మారి వెలుపలికి యూరక ద్రవింప నారంభించును. ఇట్లు శరీరపోషణమునకు ముఖ్యావశ్యకమగునట్టి ధాతువు నీరుక్రింద మారి అపరిమితముగ వెలుపలికి ద్రవింప నారంభించినచో నట్టిధాతువుకు మూలకారణమైన రక్తముగూడ క్షీణింప నారంభించును. ఎప్పుడైతే రక్తక్షీణము మొదలిడునో యప్పటినుండియు వారిలో నుండు జీవాగ్ని మందగింప నారంభించును. అది తగ్గినదే తద్ద్వారా శరీరాయవయవ పటుత్వము క్షీణించి, తుద కట్టిపురుషులు అకాలమృత్యుగహ్వరమున కాహుతియై పోయెద రనుట నిర్వివాదాంశము.

అపరిమిత సంయోగము వలన మెదడు, హృదయము, మూత్రపిండములు, శ్వాసకోశములు వీనిలోని ధాతువు క్షీణించి, పంచేంద్రియ పటుత్వము తగ్గిపోయి తద్ద్వారా చిత్తవిభ్రమము, అతిమూత్రవ్యాధి, క్షయరోగము, పాండురోగము, వ్రణములు, కీళ్లనొప్పి మొదలగు వ్యాధులెన్నియో యుత్పన్నములగును. పురుషధాతువు మనశరీరమునందు గల కండరములు, ఎముకములు, రక్తము, నరములు, కొవ్వు, మెదడు మొదలగు వానియొక్క ప్రయోజనముకంటె వేయిమడుంగుల ప్రయోజనము గలిగిన యమూల్యమగు ప్రాణరత్నమై,

పురుషునియొక్క జీవనమున కంతటికిని యాధారభూతమై యొప్పారుచున్నది. ఇట్టి ప్రాణాధార మగు ధాతువు వ్యయ మగుచో బురుషునికనేకవిధములగు ప్రాణాంతకములైన ఘోర వ్యాధులు సంఘటిల్లుట తథ్యము. మఱియునట్టివారి శరీరములు కొలదికాలములోనే మిక్కిలి దుర్బలత్వము జెంది యకాల వృద్ధాప్యమును గలుగజేయును. ఒకచుక్క ధాతువులో 60 చుక్కల రక్తము జేరియుండును గావున నట్టిధాతు వెంత పోయిన, శరీరపుష్టికి ముఖ్యమగునట్టి రక్త మన్నివిధములుగ వెలుపలికి బోవుచున్నదని ప్రతివారును గ్రహింపవలసియుండును.

ప్రస్తుతకాలమందలి యువకులలో నింద్రియప్రేరేపణ గలుగజేయు కృత్రిమసాధనములు, దృశ్యములనేకములుండుట వలన తద్ద్వారా వారియం దమితసంభోగాసక్తి ప్రబలిపోవు చున్నది. మఱియు వీరిలో నవివాహితులగువారు ధనాభావ ముచేత సంసారసుఖ మనుభవింపజాలక తమలో విజృంభించు మోహోద్రేకము నడంచుకొనుటకై యనేకదురభ్యాసములను అవలంబింపగడంగిరి. ఈదురభ్యాసములలో ప్రబలముగా వ్యాపించినదినది ముష్టిప్రయోగము. దీనివలననే యిప్పటి యువకులలో శరీరదార్బల్యము, పుంసత్వ విహీనదోషము, శుక్లపతనము (Spermtorrea) మొదలగు ననేక విచిత్రము లగు ఘోరవ్యాధులు ప్రబలిపోవుచున్నవి. మఱియు, వీరు భుజించు నాహారపదార్థములుగూడ వారి యింద్రియప్రకోప మునే హెచ్చించుటకు తోడ్పడుచున్నవి. సాధారణముగ

పట్టణములందు నివసించెడి విద్యార్థులగు యువకులును, తదితర వృత్తులలో నుండు యువకులును రాత్రివ్రూటలయందు గాఢ సుషుప్తిని జెంది, తమ శరీరమునకు విశ్రాంతి యొసగుటకు మారుగా నే సినిమాప్రదర్శములనో నాటకప్రదర్శనములనో వీక్షించుటకు బయల్వెడలెదరు. ఇట్టిచో వారారాత్రి యాప్రదర్శనములందు దొలుకాడు కృత్రిమప్రేమవిలాసము నంతటిని కనులారగాంచి, యట్టిభావోద్రేకమునకు వివశులై తమతమ గృహముల కేతెంచి తమశయ్యలపై బరుండి నిదురింప బ్రయత్నింతురు. కాని వారికి సాధారణముగ నిదురపట్టదు. తాము జూచిన ప్రదర్శనములయందలి నాయికా నాయకులయొక్క యభినయ కౌశలమే వారిస్మృతిపథములందు దాండవించుచుండును. అట్టిచో వారి శరీర మధికయుష్ణముచే తప్తమగుచుండును. అనేక యవినీతికరములగు భావపరంపరలు వారి మెదడునకు దట్టుచుండును. అట్టిచో వారిమెదడున కధిక వ్యాయామ మొసంగబడుటవలన మెదడునం దొకవిధమైన సహింపరాని యావేదన యారాటము లుప్పతిల్లును. అవయవములన్నియు సక్రమమైన విశ్రాంతి లేకపోవుటచే అపరిమితముగ నొప్పి పెట్టనారంభించును. రాత్రి భుజించిన యాహారము జీర్ణమగుటకు దగిన విశ్రాంతి లేకపోవుటచే నట్టియెడ జీర్ణకోశము క్రమము దప్పి యజీర్ణవ్యాధి ప్రభవించును. ఇట్టిస్థితిలో వారికి నిద్ర సరిగా పట్టక, పడకపై నటునిటు పొరలాడుచుందురు. అప్పుడు వారికి యనేకవిధములైన యాలోచనలు

స్ఫురించుచుండును. వీనివలన వారిలో యుష్ణము మఱింత యధికమై సర్వాంగము లుదహింప నారంభించుచు నొకవిధమైన యారాట ముదయింపసాగును. అట్టిసమయములందు వారి గోప్యాంగము లుద్రిక్తము లగును. ఇట్టిస్థితిలో వారికి చాలకాలమువఱకు నిద్ర పట్టకయుండును. తదుపరి కొంతసేపు నిదుర జెందెదరు. ఆనిద్రయైనను గాఢముగ నుండక కలతతో గూడుకొనియుండును. ఆసమయమునందు వారికి లేనిపోని దుస్స్వప్నములు కలుగును. అప్పుడు వారిగోప్యాంగముల కేదేని కొలదిపాటి యొత్తిడి తగిలినను వెంటనే శుక్లము ద్రవించును. ఈవిధముగ వారికి స్వప్నస్ఖలన మగుచుండును. ఈవిధముగ నిప్పటియువకుల శుక్ల మనేకవిధములుగ వ్యయపఱుపబడి, వారి యవయవములకు తీఱనిదౌర్బల్యము సంఘటిల్లజేయుచున్నది. కావుననే యిప్పటివారిలో నకాలమరణములు ప్రబలములై పోయినవి. ఈయకాలమరణములను జయింపవలెనన్న మున్ముందు యువకులయొక్క నైతికజీవితము చక్కబడవలయును. దేహారోగ్యాభివృద్ధికరసాధనముల నవలంబింపవలయును. అట్టి దేహారోగ్యమును సంపాదించుటకు ప్రయత్నించువారు నిర్మలపథానువర్తులై, నిష్కల్మష హృదయములు గలవారలై, నిరాడంబర జీవనాసక్తులై నెగడవలసియున్నది. ఏవిధమగు మనోవ్యాధినిగాని వారు కలిగియుండరాదు. శరీరమునకుగాని, మెదడునకుగాని యధికవ్యాయామ మొసంగు కార్యముల నాచరింపరాదు. ఎల్లప్పుడును వారి శరీరములకు తగుమైన

విశ్రాంతి యొసంగుచుండవలయును. అనవసరయింద్రియ ప్రకోపమును గలుగ జేయు మద్యము, కాఫీ, టీ మొదలగు పానీయములను, మాంసాహారము, కోడిగ్రుడ్లు, సాంబారు, పులుపు పదార్థములు, ఎక్కువకారము గల పదార్థములు, అధికోష్ణమును గలిగించు పదార్థములను బూర్తిగ విసర్జింపవలయును. రొట్టె, దంపుడుబియ్యము, కాయగూరలు, పండినపండ్లు, పాలు, పెరుగు, తేనె మొదలైనవన్నియు మంచి యారోగ్యమును పెంపొందింప గలుగునట్టివి గాన నట్టివానిని ముఖ్యముగ భుజించుచుండవలయును. అవినీతికరములగు దృశ్యముల గాంచరాదు. శుభ్రమైనగాలి వీచుస్థలములయందు శరీరవ్యాయామము నొనర్చుచుండవలయును. ప్రతియుదయ సాయంత్రముల యందును, చల్లని గాలి వీచుచోట్ల విహరింపవలయును. పరిశుభ్రమైన గాలి, ధారాళముగ వీచుచోట్ల పరుండవలయును. రాత్రులందు మేల్కొనియుండరాదు. ఈవిధముగ నిప్పటిపురుషులు ప్రవర్తించినచో వారి శరీరములందలి రక్తము పరిశుభ్రమై, యభివృద్ధి నంది వారి శరీరమునకు ను తేజమును, పుష్టిని గలుగ జేసి, తద్ద్వారా వారికి మనోల్లాసమును గలుగజేయును.



# పదకొండవ ముచ్చటలు



కం. " ధారుణి సర్వేంద్రియసుఖ
మారయ నానందరూప, మది బాహ్యాంత
స్సారసురతములఁ గల్గు న
పారపరబ్రహ్మసౌఖ్యపద మన మిగులన్ "

అని ప్రాచీనమహాశయుఁడగు నొకానొక కొక్కోకకవి నుడివిన తెలుఁగున స్త్రీపురుషాదు లిర్వురు నిర్మలమైనట్టియు, నిరాడంబరమైనట్టియు సత్ప్రవర్తనను గలవారలై, యనవసర యింద్రియప్రకోపమును గలిగించు దుష్టవస్తుసందర్శనమును మాని, తమతమశరీరారోగ్యములను జక్కగా బోషించుకొనుచు, వివాహ మాడి, మితముగ సంసారసుఖము ననుభవించినచో నట్టివారి కానంద స్వరూపసాక్షాత్కారము కరతలామలకమై, యిహపరసౌఖ్యముల జూఱగొనుచు, సత్సంతానమును గలిగి, సంతుష్టికరజీవితములను గడుపగలుగుదురు. ఈసందర్భమున ప్రాచీనులు, స్త్రీపురుషులు తమసంయోగకాలమునం దనుసరింపవలసిన సక్రమవిధానములను గుఱించి యనేక తెలుఁగులుగ నుడివియున్నారు. సక్రమసంయోగవిధానములను, తగినకాలమును, అమితసంయోగాభిలాషవలన గలుగు

చెడుగులు, సంయోగమునకు తగిన స్త్రీపురుషుల దేహతత్త్వ ములును తగని దేహతత్త్వములును, పడకటింటి నలంకరింపవల సిన తెఱగు మొదలైన ముఖ్యవిషయముల నెన్నిటినో తెలిపి యున్నారు. అట్టిముఖ్యవిషయములను స్త్రీపురుషు లందఱు నవశ్యముగ గమనించి యీతీరుగ ప్రవర్తింపవలసియుండును.

కాని ప్రస్తుతకాలమందు ప్రపంచమందలి యన్నిప్రాం తములలోను ఒకవిధమైన నూత్నవాతావరణము ప్రబలి స్త్రీపు రుషులను తారుమారుగ మార్చివేయుచున్నది. వీరందఱిలో పశుతుల్యమగు విషయవాంఛను ప్రేరేచి తద్ద్వారా వారిని పెక్కువిధముల నవినీతిపరులుగ నొనర్చుచున్నది. ఈకారణ ముచేత నిప్పటివారి శరీరము లనారోగ్యములై, దుర్బలములై పోవుచున్నవి. దీనికంతటికిని గారణము, స్త్రీపురుషుల కమూ ల్యమగు ప్రాణరత్న మనదగు ధాతువు అపారముగ, నధికసం యోగముచేతను, ననేక యమానుష వర్తనలచేతను వ్యర్థ మగుటయే. ఈధాతువు పురుషులకుగాని స్త్రీలకుగాని వారి వారిశరీరములలో నుండు కండరములు, ఎముకలు, నరములు, గ్రొవ్వు మొదలైనవానికంటెను నత్యావశ్యకమగు జీవరత్న ముగ నున్నది. ఇట్టిధాతువును జాగ్రత్తగ సంరక్షించుకొ నుచు వచ్చినవారికి దేహములు వజ్రసమానములై, చక్కని యారోగ్యముతోను, సౌష్టవముతోను నెల్లప్పుడు నలరారుచు చాలకాలమువఱకు తమజీవితము సుఖప్రదముగ గడుపగలు గుదురు. ప్రతిదినము మనము భుజించు నాహారరసము వ్వాద

యకోశములోనికి ప్రవేశించినతోడనే యచ్చట రక్తముక్రింద మారి, పిమ్మట యారక్తమునుండి ధాతువు గలుగుచున్నది. మనశరీరమునం దుండు రక్తమునందు, 60 చుక్కల రక్తము నుండి ఒకచుక్క ధాతువు తయారగుచున్నది. ఈధాతువుకు బుట్టుకస్థాన మనదగునది శిరస్సులో నుండు చిన్నమెదడే. ఈ చిన్నమెదటిలో ధాతువు పుట్టి పిదప చెవికి వెనుకభాగమునం దుండు ధాతునరములమూలముగ క్రిందికి దిగి, మెదటిక్రిందికి ప్రక్కగా బోయి గుండెకాయలో ప్రవేశించి పిమ్మట యా గుండెకాయగుండా బీజనమునకు బోయి ధాతుకమలములో నిలిచియుండును. ఈధాతువును అణుదర్శిని (Microscope) అను యంత్ర సహాయముతో జూచినయెడల వెడల్పయిన శిరస్సును నిడుపైన తోకలును గలిగియుండు ననేక ధాతుక్రిములు మనకు బాగుగ గోచరింపగలవు. ఈధాతుక్రిములు సంసారసుఖకాల మపుడు స్త్రీయొక్క మూత్రనాళము గుండా గర్భములోని కగ్రభాగమును. దానివలననే స్త్రీలకు గర్భము కలుగుచున్నది. కాబట్టి యిట్టిపుత్రోత్పత్తికి ముఖ్యహేతుభూతమగు ధాతువును పురుషుడు వ్యయపఱుపక, మంచిస్థారోగ్యస్థితిలో నుంచుకొనినయెడల యతని జీవితకాలమంతయు సంతుష్టితో గూడుకొనియుండును. ఆరోగ్యవంతమైనట్టియు, సుదృఢమైనట్టియు యువకునియొక్క ధాతువు వెలికివచ్చునపు డించుమించుగ ½ ఔన్సుతూకము గలదిగ నుండును. వ్యాధిగ్రస్తులగువారి ధాతువులో నుండు ధాతుక్రిములు మిగుల

దుర్బలములై, యటునిటు కదలుటకుగూడ శక్తిహీనులగు కొలది గమాత్రమే యుండును. దేహమున రక్తము క్షీణముగ నుం డుటవలనను, జననేంద్రియము అధికోష్ణమును గలిగియుండు టవలనను, హస్తప్రయోగాది దురభ్యాసములవలనను, వ్యాధి గ్రస్తురాండ్రగు స్త్రీలతో సంపర్కము గలిగి యుండుటవల నను, నిరంతరయింద్రియ ప్రేరేపిత దృశ్యములను గాంచుట వలన గలుగు స్వప్నస్ఖలనమువలనను, సంసారసుఖమునం దమానుషముగ వర్తించుటవలనను, ఎక్కువగా బనిజేయుట వలనను, పిన్నవయస్సునందే మితిమీరిన గ్రంథావలోకనము గావించుటవలనను అనారోగ్యకరములగు నాహారపదార్థము లను, పానీయములను పుచ్చుకొనుటవలనను, శారీరకమానసిక వ్యాధిగ్రస్తులై యుండుటవలనను నీవిధమగు ననేకకారణము లవలన పురుషులలో నుండు నమూల్యప్రాణరత్నమగు ధాతు వు వ్యయపఱుపబడుచున్నది. ఇట్టిప్రాణాధారమగు ధాతువు వ్యయపఱుపబడుటవలన బురుషు లనేక యుష్ణవ్యాధులకు లోను గావలసివచ్చుచున్నది. ఈధాతువు నధికముగ గోల్పోవువారి యొక్క శరీరములు మిగుల శుష్కించి దుర్బలస్థితియం దుం డును. ముఖములు కళావిహీనములై పాలిపోయి వెలవెల బారుచుండును. కాళ్లుచేతులు మిగుల శక్తిహీనములై, నడచు నపుడును, పనిజేయునపుడును గజగజ వణకుచుండును. అనేక దుస్స్వప్నములను నిదురలో గాంచుచుందురు. వారిగోప్యాం గములయొక్క నరములపటుత్వము క్షీణించి, యూరక వ్రేల

బడి ప్రాలిపోయియుండును. ఏపనిజేయుటకుగాని వారిలో నుత్సాహము శూన్యముగ నుండును. తలవెంట్రుకలన్నియు నెరసిపోవుట కారంభ మగును. ఏపనిజేయబోయినను నాయాసముగా నుండును. అట్టివారికి సంసారసుఖ మనుభవించుకాలమున స్త్రీస్పర్శ తగిలినతోడనే వారిధాతువు వెంటనే ద్రవించును. ఈరీతిగ ధాతువును వ్యయపఱచువారును, దురభ్యాసములకు లోనగువారును, అనారోగ్యజీవనమును గడుపువారును ననేకములగు ఘోరవ్యాధులచే బీడింపబడుచున్నారు. ఇట్టివారు వైవాహికజీవితమున కెంతమాత్రమును పనికిరారు. వీరు వివాహ మాడినచో. దమభార్యలయొక్క జీవితము దురంతచింతాక్రాంత మగునట్లు .లోనరించుటయేగాక, వారియొక్క యవినీతికరప్రవర్తనలకుగూడ ద్వారే కారకు లగుచున్నా రనుటలో నేమాత్రము సంశయ ముండజాలదు. అట్టివారు మున్ముందు తమయొక్క శరీరదౌర్బల్యమును అంగదౌర్బల్యమును సుప్రసిద్ధులును నిపుణులు నగు వైద్యులచే సక్రమచికిత్సలను బొంది సంపూర్ణముగ నివారణ మొనర్చుకొనిననేగాని వివాహ మాడరాదు.

పురుషులుగాని స్త్రీలుగాని తమచిన్ననాటనుండియు తమ శరీరారోగ్యములను గుఱించి తగిన శ్రద్ధ దీసికొని తత్సాధనములగు వ్యాయామముల నన్నిటిని యొనర్చుచుండవలయును. అనవసరయింద్రియప్రేరేపణను కలిగించెడి దృశ్యముల సందర్శించుటగాని, తత్సంబంధమైన గ్రంథముల నవలోకిం

చుటగాని యెంతమాత్రమును గూడదు. చక్కగా నవయవము
లన్నియు పుష్టికరములై యొప్పునంతవఱకు స్త్రీపురుషసంయో
గము పనికిరాదు. అంతవఱకును వారిరువురికిని విషయవాంఛ
యీషన్మాత్ర మేనియు పొడసూపక, నిష్కల్మషజీవితమును
గడపుచు, సద్బ్రహ్మచర్యవ్రతావలంబకులై, సర్వవిధముల
యాత్మనైర్మల్యమును, ఆధ్యాత్మికచింతనమును, సద్భావము
లను ప్రేరేచెడిసాధనములను బాగుగ నారసి వాని నవలం
బింపవలయును. ఇట్టి స్త్రీపురుషాదులయొక్క భావిసంసార
జీవితము మహదానందముతో నొప్పారగలదు.

ఈసందర్భమున స్త్రీపురుషాదులయొక్క సంయోగ
విధానములనుగుఱించి కొంతవఱ క్రింద సూచింపగడం
గెదము:—

ప్రస్తుతకాలమున స్త్రీపురుషాదులు తమయొక్క యీడు
జోడును, అనుకూలదేహతత్త్వములను గమనింపక విచ్చల
విడిగ సంచరించుచున్నారు. అందునను మనదేశమున నీస్వే
చ్ఛావిహారము స్త్రీలలో కంటె బురుషులలో నధికముగ
గాన్పించుచున్నది. కావుననే యిప్పుడు మనలో జాలమంది
ప్రమేహాదిరోగము లనేకములచే బాధనందుచున్నారు. కావున
పురుషులు తమభార్యలతోదప్ప నితరులతో నెన్నటికిని సంసార
సుఖ మనుభవింపగూడదు. అమితసంయోగాసక్తి గల స్త్రీల
తోను, క్షయ అతిమూత్రవ్యాధి ప్రమేహము గుల్మము
మొదలగు వ్యాధులచే బీడింపబడువారితోను, పక్షవాతము

ఏనుగుకాలు కుష్ఠము మొదలగు వ్యాధులు గలవారితోను ఏమాత్రము సంపర్కమును గలిగియుండరాదు. మఱియు ఋతుమతులగు స్త్రీలతోను, ప్రసవించినస్త్రీలతోను సంపర్కము గూడదు. అట్టిచో నాకాలమునందు స్త్రీలకు దుష్టరక్తస్రావ మధికముగ నుండుటచే నట్టి దుష్టరక్తముయొక్క యుష్ణము పురుషునియొక్క మెదడునకును, హృదయమునకెగ బ్రాకి తద్వారా బుద్ధిమాంద్యము, నేత్రరోగము, ప్రమేహము, కీళ్లవాతము మొదలగు ననేకఘోరవ్యాధు లుత్పన్నములగుట కవకాశ మేర్పడును. మఱియు స్త్రీ ముట్టయినతర్వాత మంగళస్నాన మాచరించి యింటిలోనికి వచ్చిననాడే పురుషుడామెతో జేరగూడదు. అట్లామెను గూడినచో నప్పటికింకా డనామెలో నుండు దుష్టరక్తస్రావచిహ్నములు పూర్తిగ నాగిపోకుండుటచే తద్వారా యట్టిపురుషునియొక్క దేహారోగ్యము చెడిపోయి, పలురోగములకు దావాసంగును. గర్భిణీస్త్రీలతో జేరినయెడల వారిగర్భపిండము చాల బలహీనమై గర్భము చెదరిపోవుటయో, యకాలప్రసవమో, కష్టప్రసవమో, గర్భములో నుండు శిశువు చచ్చి పుట్టుటయో, పుట్టిన శిశువు వికలాంగుడై పుట్టుటయో మొదలగునవి సంభవించును. కావున స్త్రీపురుషు లేపై జెప్పబడిన యంశముల నన్నిటిని జక్కగ గమనింపవలయును.

· తర్వాత, యీపై జెప్పబడిన యంశములేగాక స్త్రీసంయోగమునకు తగనిసమయములగుఱించి మాపాఠకులకు

గొంతవఱకు దెలిపెదము. సాధారణముగ నిప్పటివారు సంయోగమున కొక కాలనిర్ణయము, తగినసమయమును సరిగ గుర్తింపక, నెప్పటి కప్పుడు విచ్చలవిడిగ సంపర్కమును గలిగియుండుటవలనగూడ ననేకయనర్థములను బొందుచున్నారు. ఆహారమును భుజించినవెంటనేగాని, భుజించినయాహారము సరిగ జీర్ణము కానియపుడుగాని, నిద్రలేకుండునపుడు నిద్రనుండి లేచినవెంటనేగాని, మనోవ్యాకులమును గలిగియున్నపుడుగాని, మిగుల యలసియుండునపుడుగాని, మత్తుపానీయములను సేవించినపుడుగాని, ఆకలిదప్పులు గలిగియున్నపుడుగాని, శరీరము లధికయుష్ణములై లేక శీతలములై యున్నపుడుగాని, పగటివేళలందుగాని పురుషుల కేమాత్రము సంపర్క ముండరాదు. ఉన్నచో వారి కనేకరోగములు సంప్రాప్తించగలవు.

ఇక పురుషులకు స్త్రీసంపర్క ముండగూడని తిథివారనక్షత్రాదులను ప్రాచీనమహాపురుషు లగు మనువు, బృహస్పతి మొదలగువారీక్రిందివిధముగ దెలిపియున్నారు. కావుననే యిప్పటికిగూడ చాలమట్టుకు మనదేశములో యువతీయువకుల ప్రథమసమాగమదిన మప్పుడు పెద్దలు సరియగు తిథివారనక్షత్రాదులను నేర్పఱచి శుభలగ్నమును నిర్ణయించెదరు. కావున మేమీక్రింద స్త్రీపురుషసంయోగము నిషేధింపబడిన తిథివారనక్షత్రాదులను గొన్నింటిని యుదహరించుచున్నాము:—

అశ్విని, భరణి, కృత్తిక, మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూషా, ఉషా అను నీనక్షత్రములును, అమావాస్య, పౌర్ణమి, ప్రథమ, చతుర్థి, షష్ఠి, అష్టమి, ఏకాదశి, త్రయోదశి యను నీతిథులును, నూతనవత్సరారంభదినము క్రొత్తనెలపుట్టుతొలిదినము, వ్రత దినము, వ్రతదినముయొక్క ముందుదినము, ఋతుకాలము, యాత్రకాలము, గ్రహణకాలము, ఆదివారము మొదలగు దినములందును పురుషు లేమాత్రము స్త్రీలతో సంయోగ మొనర్పరాదు. ఈపైజెప్పబడిన కాలములందు స్త్రీపురుషు లిద్దరు సంయోగ మొనర్చినచో, నట్టివారికి జనించు బిడ్డలు విద్యావిహీనులుగను, దుష్ప్రవర్తకులుగను, తమయాజ్జీవము దరిద్రదేవతారాధకులుగను, సర్వదా వ్యాధిపీడితులుగను, వంశక్షయకారకులుగను, పితృకర్మల నాచరించుటకు యోగ్యత లేనివారుగను, ఎల్లప్పుడును దుర్మార్గపుటాలోచనలను దుర్మార్గకృత్యములను జేయువారుగను తయారు కాగలరు. ఈవిధముగ పూర్వపురుషాస్త్రులు గొప్పయనుభవముచే, స్త్రీ పురుషులయొక్క పశుతుల్యమగు కామేచ్ఛ నడంచి, వారి సంసారసౌఖ్యమును, సక్రమవిధానములపై నెలుపగలుగుచు, సత్సంతానమును బడయగలుగుదు రను సదుద్దేశముతోడనే నవిస్తరముగ తమతమగ్రంథములందు రచించియుండిరి. అట్టి ముఖ్యవిషయముల నిప్పటిస్త్రీపురుషాదులు ముఖ్యముగ గమ నించి తదనుసారముగ బ్రవర్తించినచో వారికి మేలొదవును.

అటుతరువాత యేయేస్త్రీలతో గూడిన యెట్టిఫలము లొందవునో వానినిగురించి పూర్వు లీవిధముగ దెలిపియుండిరి:-

బాలపర్వపుపడుచులను గూడినచో దేహమునకు కొంచె ముష్ణమును, సంతోషమును, మంచిశరీరదార్ఢ్యమును, నిర్మల మైన ప్రకాశమును గలుగును.

యౌవనదశయం దున్న పర్వపుస్త్రీని గూడినచో పురు షునియొక్క పంచేంద్రియములకు నూతన్నైతేజమును, ఉల్లాస మును ప్రభవించును. ప్రౌఢస్త్రీని గూడినచో నట్టిపురుషునికి జ్ఞానోద్దీపనము, స్వల్పసంతోషము లభింపగలవు.

వృద్ధస్త్రీని గూడినచో బురుషునియొక్క శరీరదార్ఢ్యతీ ముడిగి, నరములపటుత్వము సడలి యనేకవిధములగు వ్యాధు లకు లోనుగావలసివచ్చును.

అని యీవిధముగ నాయాస్త్రీలతో సంగమించినచో నాయాఫలములు గలుగునని విశదీకరించిరి. పురుషు డెప్పు డును తనయావజ్జీవము తాను వివాహమాడిన భార్యతో దప్ప నితరులయొక్క సంపర్కమును గలిగియుండరాదు. ఏలయన, తనయొక్కయు, తనభార్యయొక్కయు శరీరతత్త్వములు చాల కాలానుభవమువలన నొకదాని కొకటి తగిపోవుటచే వారిరు వురి సంగమమువలన నేలాటిరోగములుగాని యుత్పత్తి యగు టకు నవకాశము లేమాత్ర మేర్పడజాలవు. అట్లుగాక పురు షుడుగాని, స్త్రీగాని యితరులయొక్క పొందు కోరినచో, నట్టి

యెడ, తమయొక్కయు నితరులయొక్కయు దేహతత్త్వములు పరస్పరభిన్నతత్త్వములు గలవిగ నుండుటచే, నప్పుడు వ్యాధుల త్పన్నము లగుటకు ననేక కారణము లేర్పడగలవు. కావుననే ప్రాచీనులు, స్త్రీపురుషులలో వివాహధర్మమును సుస్థాపితమొనర్చి పురుషులకు ఏకపత్నీవ్రతమును, స్త్రీలకు పాతివ్రత్యమును నేర్పఱచియుండిరి. ఆధునికస్త్రీపురుషు లట్టిశాస్త్ర సంబంధములగు ముఖ్యవిషయముల నన్నిటిని పాటింపక విచ్చలవిడిగ సంచరింప నారంభించుటచేతనే మనదేశ మీనాడు అనేకసుఖవ్యాధుల కాలవాలమై పోవుచున్నది.

ఈ తెఱంగున స్త్రీపురుషాదులయొక్క సంయోగకాల నిర్ణయమును సక్రమసంయోగవిధానములను పూర్వులు విశదీకరించియుండిరి. ఇక వివాహితులగు దంపతులు పడకటిండ్లలో నడుచుకొనవలసిన తీరును, పడకటిండ్లలంకరింపబడవలసినదియు, వానివలని ఫలితములు మున్నగువానినిగూర్చి కొంత వఱకు తెలిసికొందము:—

సాధారణముగ స్త్రీలు ఋతుమతులై నపిమ్మట మంగళస్నాన మాచరించిన నాలుగవదినము మొదలు పండ్రెండవదినమువఱకు సంసారసుఖమున కెంతయు దగినవారుగ నుందురు. అట్టికాలమునందు పురుషులు వారితో సంసారసుఖమనుభవించినయెడల నట్టికాలమునందు వారికి జనించు బిడ్డలెంతయు నారోగ్యవంతులై, దృఢకాయులై యుందురు. ఆకాలమే స్త్రీలకు సత్సంతానము గలుగు కాలమని బాగుగ

గుర్తింప నగును. పురుషధాతువు స్త్రీరజస్సుకంటె తక్కువగా నున్నచో నట్టియెడ స్త్రీ గర్భము దాల్చినచో స్త్రీశిశువు జనించుట తథ్యము. అట్లే స్త్రీరజస్సు పురుషధాతువుకంటె తక్కువగ నున్నచో మొగశిశువు కలుగును.

ఇక పడకటిండ్లగుఱించి చూతము. పూర్వపు పడకటిండ్లకును నిప్పటివాటికిని హస్తిమశకాంతరము గలదు. పూర్వకాలమందలి పడకటిండ్లన్నియు నిప్పటివానివలె యవినీతికరములగు చిత్రపటములచేతను, దంపతుల నమానుషముగ బ్రవర్తించునట్లు ప్రేరేపించు మత్తుపదార్థములతోను, తదితరవస్తుజాలముతోను గూడుకొని యుండక, దంపతులలో నాధ్యాత్మికచింతనాసక్తినివి నిర్మలభావోదయమును గలిగించునట్టి మంచిచిత్తరువులచేతను, వస్తుసామగ్రులతోడను అలంకరింపబడియుండెడివి. చిత్రపటములన్నియు చంచలమైనట్టియు, దాత్కాలికమగునట్టియు కామేచ్ఛను ప్రేరేపించునట్టివిగాక యన్నియు నాధ్యాత్మిక ప్రేమతత్త్వప్రబోధమును గలిగింపగలుగు భగవత్సంబంధము లగునవిగనే యుండెడివి. ప్రస్తుతము రానురాను పడకటింటి యలంకారములు చాల విపరీతదుష్ఫలిత ప్రాప్తిని గలుగ జేయునట్టివిగ నున్నవి. ఇప్పటిపడకగదులందలి గోడలన్నియు స్త్రీపురుషాదులయొక్క యవినీతికరచేష్టిదములను, నమానుషక్రియలను దెలుపు చిత్రపటములచేతనే యలంకరింపబడియున్నవి. విగతవస్త్రులైనట్టి స్త్రీలయొక్క చిత్రములను; విపరీత సంసారసుఖక్రీడల దెలియాడెడు

స్త్రీపురుషులచిత్రములను నింకను ఈవిధములగు నింద్రియప్రే రేపణను కలుగజేయు చిత్రము లెన్నియో నలంకరింపబడి యున్నవి. ఇట్టివానివలన దంపతులయొక్క మనోభావవైఖరు లుగూడ తదనుగుణ్యముగ మారి పశుతుల్యమగు వాంఛ వారిలో బొడమి, తమసంయోగకాలమందు విచ్చలవిడిగ, నమానుషముగ నవినీతికరముగ వర్తించుచు తుదకు తమశరీర ములకు దీఅని దౌర్బల్యమును గొనితెచ్చి పెట్టుకొనదరు. కావుననే యిప్పటివా రింతటిశరీరదౌర్బల్యమును గలిగి ఆరో గ్యభాగ్యమునకు విదూరులై అకాలమరణముల నందుచు న్నారు. ఈవిధములైన యకాలమరణముల పాల్జేయు విధాన ముల ప్రేరేపించెడి దృశ్యములనుగాని పటములనుగాని తమ పడకటిండ్లలో దంపతు లేమాత్ర ముంచుకొనరాదు. సద్భా వోదయకారకములగునట్టియు, నాధ్యాత్మిక ప్రేమతత్త్వమును దెలుపునట్టియు చిత్రపటములనే తమపడకగదులయందు దంప తు లుంచుకొనవలయును. అనవసరయుద్రేకమును గలిగించు సుగంధద్రవ్యముల నంతగా నుంచగూడదు. భగవత్సంబంధ మైన రాధాకృష్ణులయొక్క ఆధ్యాత్మికప్రేమోన్నతిని దెలియ జేయునట్టి చిత్రపటములను, సీతారాముల చిత్రపటములను, నింకను పూర్వపుచరిత్రలలో దెలుపబడియున్న పుణ్యచారి త్రాంశులగు స్త్రీపురుషాదులయొక్క చిత్రపటములను నలంక రింపవలయును. అట్టియెడ దంపతుల హృదయములలో సద్భా వోదయ మగును, అప్పుడప్పుడు వారిహృదయములందు దళ

జాప యుత్పించెడి దుష్టభావముల నన్నిటిని యీసద్భావము లొక్క త్రుటికాలములో నిర్జింపగలుగును. ఈసందర్భమున నొక చిన్న వింతయుదాహరణము నిట బేర్కొనెదము:—
ఒకానొకపుడు వివాహితులగు నైరోపీయను దంపతు లిరువు రును తమపడకటిండ్లలో సంసారసుఖ మనుభవించుకాలమున, స్త్రీ తనపడకటింటికుడ్యమునం దొకానొకచో దగిలింపబడి యున్న యొక ఆఫ్రికను దేశీయుడగు నీగ్రోజాతి పురుషుని యొక్క చిత్రపటమును అవలోకించి, వానియొక్కరూపమును వలువువర్ణమును, శరీరసౌష్ఠవమును సంస్మరించుకొనెను. అటు పైని కొంతకాలమునకు ప్రసవించెను. అప్పు డామెకు జనించిన బిడ్డ డానాడు తాను విలోకించిన నీగ్రోజాతిపురుషునే పోలి యుండెను. అది చూచి యాస్త్రీ చాల యుబ్బురపడెను. ఆమె యొక్క భర్త, యామెకును నీగ్రోజాతివానికిని సంబంధ మున్నదని యనుమానించుచుండెను. పిమ్మట సరియైనకార ణమును గుర్తింపగలిగెను. ఈయుదాహరణమునుబట్టి దంప తులు తమపడకటిండ్లలో నెట్టిభావముల ప్రేరేచు చిత్రపట ముల నలంకరించిన నట్టిభావములే వారికిగూడ బొడమి, తత్సం బంధమైన సంతానమే బడయుదురని తెలిసికొనవలసియున్నది. ఇయ్యది గొప్పగొప్పతత్త్వశాస్త్రవేత్తలచే నొనర్పబడిన సిద్ధాంతము. కావున దంపతులు, తమపడకటిండ్లను సద్భావ పూరితములగు చిత్రపటములచేతనే యలంకరింపవలయును. దంపతులు పడకటిండ్లలో ప్రవేశించినవెంటనే పరిశుభ్ర

యకు లోను గాకూడదు. కొలదిసేపు సద్గోష్ఠిని, సద్గ్రంథా
వలోకనమును నెఱపవలయును. సంగీతముచేతగూడ కాలము
బుచ్చవచ్చును. పడకటిం డ్లన్నియు ధారాళముగ స్వచ్ఛమైన
గాలి వీచు నేర్పాట్లను గలిగియుండవలయును. తేమగాగాని,
మురికిగాగాని యుండక శుభ్రముగ నుండవలయును. గదిగోడ
లన్నియు సున్నముతో వెల్ల వేయబడియుండవలయును. వారు
శయనించు పడక మురికివస్త్రములచే గప్పబడియుండరాదు.
ఎప్పటి కప్పుడు పడకను బాగుగ దులిపి శుభ్రపఱచి తెల్లని
దుప్పటిని పఱచియుంచవలయును. దంపతు లిరువురు నొకరిపై
నొకరికి యనుమానము, యసూయ, మాత్సర్యము, క్రోధ
ము మొదలగువానిని గలిగియుండరాదు. ఒకరిపై నొకరికి
నిర్మలప్రేమానురాగములు కలిగియుండవలయును. భార్య,
తనభర్తయే తనకధిదైవమనియు, ప్రాణమనియు, ప్రేమమూ
ర్తియనియు దృఢసంకల్పమును గలిగియుండవలయును. అట్లే
భర్త, భార్యయే తనగృహలక్ష్మి యనియు మోక్షమార్గ
దర్శిని యనియు, తనప్రాణసర్వస్వమనియు నమ్మిక
మును, గౌరవమును గలిగియుండవలయును. దంపతు లొండొ
రులు పరస్పరభిన్నభావములను కలిగియుండుటవలనను, క్రోధ
ము, భయము, చిత్తచాంచల్యము, మనోవ్యాకులము మొద
లగునవి యుండుటవలనను, సంయోగకాలము నవలంబించు
విపరీతవిధానములు, కండ్లు మూసికొనియుండుట, చెవులు మూ
సికొనియుండుట మొదలైనవానివలనను నట్టివారికి జనించు

బిడ్డలు కురూపులుగను, గ్రుడ్డివారుగను, అంగవైకల్యులుగను, దుర్బలులుగను, క్రూరులుగను, వ్యాధిగ్రస్తులుగను, నిరంతరవ్యాధిపీడితులుగను నుందురు. భార్య, ఋతుమతియై మంగళస్నాన మాచరించినపిదప నారాత్రి మధురములగు పదార్థములను భుజించి, సర్వాభరణభూషితురాలై, తాంబూలసేవన మొనర్చి, నవవికసిత పుష్పములను తలయందు దాల్చి, శుభ్రమైన యుడుపులను ధరించి కల్మషరాహిత్యమగు మనస్సుతో, తనభర్తయెడల నిర్మలప్రేమభావమును గలిగి, యేలాటిమనోవైకల్యమునుగాని కలిగియుండక పడకటింటిలోనికి ప్రవేశించి, భర్తతో చాలకాలమువఱకు కీష్టాగోష్ఠిని నెఱపి, యతనిని ప్రఫుల్లవదనునిగా జేసి, పిమ్మట యాతనితో గూడవలయును. అట్టిచో వారిరువురికిని జనించు బిడ్డలు మంచిశరీరారోగ్యము గలిగి, సౌందర్యమూర్తులై, చాలకాలమువఱకు జీవింపగలిగియుందురు.

పడకటింట్ల యలంకారములను గుఱించియు, పడకటింట్లుండవలసిన రీతినిగుఱించియు, సక్రమసంయోగ విధానములను కాలనిర్ణయమును గుఱించియు నీపైనుదహరింపబడిన ముఖ్యాంశముల నన్నిటిని యిప్పటిస్త్రీపురుషాదులు బాగుగ గమనింపవలయును. కాని ప్రస్తుతపు వివాహితులగు నూతనదంపతు లీపై దెలుపబడినవిషయముల నేమియు నెఱుంగక తమ ప్రథమశయ్యాగృహప్రవేశమహోత్సవసందర్భమున ననేక కుమార్గముల నవలంబించుచున్నారు. ఈకారణములవలన వారి

లో నొకరిపై నొకరికి నిజమైన ప్రేమానురాగము లుద్భవము
లగుట దుస్సాధ్యము. నూత్నదంపతులయొక్క ప్రథమసమా
వేశ మప్పు డొకరినొకరు క్రొత్తవారివలె జూచుకొనుచు, నొక
రిని జూచి యొకరు భీతిని జెందరాదు. ఇరువురు స్నేహితు లొ
క్కచో జేరి యెట్టు లేకాంతగోష్ఠిని నెఱపెదరో యారీతిగనే
వారుగూడ బ్రవర్తింపవలయును. ప్రస్తుతకాలములో గొందఱు
యువతులు తమభర్తలతో ప్రథమసమాగమపుడు వారిని
జూచి చాలభయమును సిగ్గును జెంది, పడకటింట్లోనికి
బ్రవేశించుటకే చాల భీతిలుచుందురు. తలిదండ్రులయొ
క్కయు, నితర యాప్తబంధువర్గముయొక్కయు బలవంతముచే
వారు పడకగదిలోనికి ప్రవేశ మొనర్తురు. అట్లు ప్రవేశించి,
యచ్చట శయ్యపై నుపవిష్టులై యున్న తమభర్తలను గాంచు
టకును; సమీపించుటకును భీతిని సిగ్గును బొందుచు నాగ
దిలో నొకమూల చతికలబడియుందురు. ఆసమయమునం దిప్ప
టివారిలో గొంతమంది పురుషులు మూర్ఖులై, వారిచెంతకు
బోయి, వారి ననేకవిధముల బలాత్కరించెదరు. అట్టియెడ నా
యువతులకు తమభర్తలపై నెంతమాత్రము ప్రేమానురాగ
ములు, గౌరవభావములు పొడసూపజాలవు. పైపెచ్చు అసూ
య, ద్వేషము, క్రోధము మొదలైనవి పొడసూపును. అట్లు
మూర్ఖత్వమును వహింపక, నట్టియెడ తెలివి గల పురుషు
లాపె యట్లు చతికిలబడియుండుటను జూచి చూడనట్లుగ నుం
డి, యేదియో గ్రంథకాలక్షేపమునుగాని, లేక తత్సంబంధ

మైన యితర వ్యాసంగములనుగాని కలిగియుండవలయును. అప్పు డాయువతికి భీతి లజ్జ కొంతవఱకు పోయి, యోఱచూపు లతో దమభర్తల నప్పుడప్పుడు కాంచుచుందురు. అది గ్రహించి భర్తలుగూడ వారివంక జూచుచుండవలయును. అట్లు లిరువురి చూపు లొకసారి తారసిల్లినతర్వాత యిరువు రును గొంతసేపటివఱకు మాట్లాడ కుండెదరు. పిమ్మట కొంత సేపటి కిరువురి వదనములమీదను చిరునవ్వులు దాండవించు చుండును. ఆపయిని మెల్లమెల్లగా నొకరితో నొక రన్యాపదేశ ముగ మాటలాడుకొనుట కారంభింతురు. ఆసమయమున బురుషు డేలాటి యాతురతయును గన్పఱుపక నతిశాంత ముతో స్థిరచిత్తుడై యుండవలయును. అప్పు డట్టిస్థిరచిత్తములు గలిగిన తమభర్తలను జూచి యాయువతుల కిదివఱ కుండు లజ్జ భీతి యనునవి సంపూర్ణముగ వీడిపోవును. అప్పుడు వారు గూడ తమభర్తలతో ధారాళముగ మాటలాడుట కారం భింతురు. అట్లు కొంతసేపటివఱకు సద్గోష్ఠిని సరసాలాపముల నాడుచు పిమ్మట యిరువురును జేరుదురు. అట్లు చేరునపుడు వారిరువురియం దేలాటి విరుద్ధభావములుగాని యుదయము కాజాలవు. ఇట్టిచో వారికి జనించు సంతోషసౌఖ్యము లపారము. అప్పటినుండియు వారిజీవితమంతయు సౌఖ్యప్రదమై యుండి, నారోగ్యభాగ్యముతో దులదూగుచు సత్సంతాన మును బడయగలుగుదురని మాదృఢాశయము.

---

# ప్రేమలేఖలు



పూర్వమునుండియు ప్రతిదేశములోను కామినీకాముకులును, యువతీయువకులును దమయొక్క ప్రేమసందేశముల ననేక చిత్రగతుల ననుసరించి యొకరికొకరు దెలుపుకొనెడివారు. వీనిలో మనభారతదేశమం దిట్టి ప్రేమసందేశములను సంపుటయం దనేక చిత్రగతు లనుకరింపబడుచున్నవి.

ప్రస్తుతమం దున్న తపాలా ఆఫీసులు, తంతీవార్తలు, అయోమార్గసౌకర్యములు, రోడ్డులు మొదలైన సౌకర్యములు లేని కాలమునను, నతిప్రాచీనకాలమునందును మనదేశమునందలి ప్రేమదంపతులయొక్క ప్రేమసందేశములు కడుచిత్రవిచిత్రముగ నుండెడివి. ఉదాహరణమునకై రుక్మిణీదేవికిని శ్రీకృష్ణపరమాత్మకును జరిగిన ప్రేమసందేశమును గురించి పరికింపుడు. రుక్మిణీదేవి, తనకు గాఢవిశ్వాసమును గలిగిన యొక బ్రాహ్మణోత్తముని బిలిచి, యతనితో, దనకు శ్రీకృష్ణపరమాత్మునియందు గల పవిత్రప్రేమోన్నతి నంతటిని విశదముగ జెప్పి, యెట్లులైనను తాను శ్రీకృష్ణపరమాత్మనే వివాహమాడుదుననియు నొరుల నెవరిని వివాహమాడననియు, గావున తనయందు దయయుంచి, పరమాత్మ వేగిరపడి రావలయుననియు, లేనిచో దనయన్న తన్ను శిశుపాలున కివ్వదలపెట

నాడనియు, నట్లైనచో దానాత్మహత్య గావించుకొందుననియు మొదలైన నిర్మలప్రేమపూరితభావగర్భితమగు భావణముల నెన్నియో చెప్పి, యాబ్రాహ్మణుని శ్రీకృష్ణునికడ కంపెను. ఆబ్రాహ్మణుడుగూడ నామె చెప్పిన వాక్యములుగ శ్రీకృష్ణ పరమాత్మతోజెప్పి యాతనికి గూడ రుక్మిణీదేవియందు గాఢ ప్రేమను నుదయింపజేసి, వెంటనే యతనిని తనతో దోడ్కొని రుక్మిణీదేవికడకు గొంపోయెను. ఈరీతిగ నాదినములలో మంచి నైపుణ్యము గలవారే యిట్టిప్రేమసందేశములను గొని పోయెదరు. పిదప గొంతకాలమునకు నట్లు మనుష్యులను బంపుటవలన జాల కాలయాపన మగుచున్నదని యెంచి, యువతులు తమ ప్రేమసందేశమును ప్రియులకు దమ పెంపుడు పావురముల ద్వారాను, రాజహంసలద్వారాను పంపెడివారు. కొందఱు చెట్లయాకులమీద వ్రాసి పంపెడివారు. మఱికొందఱు తమలపాకుల మడుపులద్వారా పంపెడివారు. ఈతమలపాకు మడుపులద్వారా ప్రేమసందేశములను బంపుట కడు విచిత్రముగ నుండును. వీనినే "కిళ్లీకు"లని యప్పుడు వ్యవహరించెడివారు. కిళ్లీకు లనగా రహస్యములతో గూడిన యాకులనియర్థము. ప్రియుడుగాని, ప్రేయసిగాని యొకరిపై నొకరికి గల ప్రేమానురాగములను దెలుపుకొనవలయునన్న తమలపాకులను చిత్రముగ మడిచి, వానిమీద నొక్కులునొక్కులుగ దమచేతిగోళ్లతోనో మఱివేనితోనో కావించి, యామడుపుల నొకరికొకరు పంపుకొనియెదరు. ఇట్లు ప్రేమసందేశము లాకాల

మున బంపుకొనబడుచుండెడివి. తరువాత నాగరకతావ్యాప్తి కొంతవఱకైనతర్వాత, స్త్రీలు కొంతవఱకు విద్యాగంధమును గలిగి తమప్రేమలేఖలను కాగితములపైననే వ్రాసి పంపుచుండెడివారు. వానిలో, దమలో నుండు నుత్కృష్ట ప్రేమభావములనన్నిటిని, తమతమ విద్యానైపుణ్యము మెఱయు, మృదుమధురములగు పదములతో నతిచమత్కారము మెఱయ, శ్లేషయుక్తముగ ననేకతెఱంగులుగ వ్రాసి, యొకరినొకరాకర్షించుకొని, యిరువురులయందు నిర్మలప్రేమభావ ముదయించునట్లుగ నొనర్పగలుగుచుండిరి. ఈలేఖలలో కొన్నిపద్యరూపముగను, కొన్నిగద్యరూపముగను నుండెడివి. అయ్యవి చాల వఱకు నిశ్చలమైనట్టియు, నిర్మలమైనట్టియు ప్రేమానురాగములను పెంపొందించి, యాదర్శప్రాయములుగ నుండియుండెడివి. కావుననే వారిదాంపత్యముకూడ నత్యంతసుఖప్రదమై, సంతోషప్రదమై యొప్పుచు, వారికి సత్సంతానమును బడయగలుగు నమూల్యప్రభావప్రసాద మొసంగగలిగెను.

ఇక యిప్పటి ప్రేమసందేశవైచిత్ర్యముల నొకింత పరికించినచో, వివిధములగు విపరీతప్రేమభావప్రపూరితములై వ్యాప్తి నందుచున్నవి. ఇప్పటివాతావరణమంతయు కృత్రిమవిలాసమును దొలుకాడజేయునట్టిదృశ్యములచేతను, పదార్థములచేతను; గ్రంథములచేతను, నిండియుండుటచే యీవాతావరణమందు నివసించునట్టి యువతీయువకుల హృదయములందుకూడ నట్టికృత్రిమపుప్రేమయే హత్తిపోయి, వారి

దృష్టులయందును, పలుకులయందును, చేష్టలయందును, నడుపులయందును, వ్రాతలయందునుగూడ బ్రతిబింబించు చున్నది. ఇట్టిచో వీరిప్రేమ, కృత్రిమ భావప్రపూరితమే యై యుండునని చెప్ప నెన్నటికిని యనుచితము, సత్యదూరము కాజాలదు. ఇట్టికృత్రిమప్రేమపూరితములగు లేఖలవల్ల ననేక యనర్థములు వాటిల్లుచున్నవనుట సాధారణముగ బ్రతివారికిని యనుభవైకవేద్యమే. యువతీయువకు లొండొరులు తమతమ కృత్రిమవిలాసదృక్కుల చేతను, కృత్రిమస్థూలసౌందర్యవిలాసముచేతను నొకరివంక నొక రాకర్షింపబడి, త్వరపడి వెంటనే ప్రేమలేఖలను వ్రాసికొని, తద్ద్వారా యొకరిప్రేమ నొకరు దెలిసికొని, ఆపయిని వివాహములను గావించుకొని, తా మొకరి నొకరు ప్రేమించుకొని పెండ్లియాడితిమనియు, గావున ప్రతివారును ప్రేమించియే వివాహములను గావించుకొన వలయుననియు సిద్ధాంతీకరించుచు, ప్రతివారును తమప్రేమయే యాదర్శప్రాయమనియు భావించుకొనుచున్నారు. అట్టికృత్రిమ ప్రేమచే నొకరి నొకరు వివాహములు గావించుకొనిన వారి దాంపత్య మిప్పు డెంతటివిపరీతస్థితియం దున్నదియు జాలవఱకు మనకుగూడ విస్పష్టమే. కావుననే యిప్పుడు మనదేశమునందు గూడ నితరదేశములందువలెనే వివాహవిచ్ఛేదములు ప్రారంభ మగుచున్నవి. ఈసందర్భమునందు యిప్పటినవనాగరితా ప్రపూరితదేశములందలి యువతీయువకులను గాంచినచో సత్యము సాక్షాత్కరింపగలదు. ఆదేశములలోని స్త్రీపురుషు

లంకలు వివిధవర్ణోపేతములగు నుడుపులను ధరించుచు, కృత్రిమ సౌందర్యమును పెంపొందింపజేయు వస్తువులను వాడుచు, నట్టికృత్రిమసాధనములయందే తమయభిరుచి మెండై యుండునుగాన వారు చేయునట్టి ప్రతికార్యమునందునుగూడ నట్టి కృత్రిమభావములే ప్రస్ఫుటితము లగుచుండును. అట్టివారి యొక్క ప్రేమభావములుగూడ కృత్రిమపూరితములై యుండి, వారు వ్రాయు లేఖలందుగూడ నాకృత్రిమప్రేమభావములనే విశదీకరించుచుందురు. ఇట్టిలేఖలను వ్రాయుటలో మనదేశమునందుకంటె యూరప్రాంతములయం దుండు స్త్రీపురుషాదుల కెక్కుడు నైపుణ్యము గలదు. తమప్రేమలేఖలందు దమనైపుణ్య మంతయు మెఱయ నొకరి కొకరు వ్రాసికొని, తద్వారా తమకృత్రిమభావపూరితప్రేమసందేశముల నంపుకొని యొకరి కొకరు సమావేశమై, కొన్నివసంత రాత్రులు గడపి, పిదప వివాహములు గావించుకొనియెదరు. అట్టివారివైవాహికజీవనముగూడ కృత్రిమస్వరూపముచేత నావేశమై, మిగుల చంచలమై యుండును. కావుననే యిప్పుడు నానాటికి వివాహవిచ్ఛేదములు ప్రబలము కాజొచ్చినవి.

ఈవిధముగనే యిప్పుడిప్పుడు మనదేశమునందుగూడ కృత్రిమభావసంపర్కము గలవారై, స్త్రీపురుషు లన్యోన్యము ప్రేమించుకొనుచు, తమప్రేమసందేశములను, తపాలాద్వారా నంపుకొనుచున్నారు. ఈసందర్భమున మేము కొన్నిప్రేమ లేఖల సారాంశము నిట పొందుపఱచుచున్నాము.

ఒకయువివాహిత యగు యువతి యొకయువకున కీక్రింది విధముగ లేఖ నతినైపుణ్యముతో వ్రాయుచున్నది:—

నా ప్రేమమూర్తీ, కాకినాడ. 18. జనవరినెల 27.

మీరానాడు మాయింటికి వచ్చి, మాయన్నతో మాట్లాడుచుండగా నప్పుడు మీయొక్క యాజానుబాహు విగ్రహముయొక్క సాక్షాత్కారము నానేత్రములకు ప్రసాదింపబడియెను. అప్పుడు మృదుమధురములగు పలుకులు మీనోటినుండి వెడలునపుడు కలిగిన మీయధరము యొక్క వింతచమత్కారచలనమును, ఆపలుకులకు రూప మొడగూర్చుటకై, యత్నించెడి బాహుద్వయముయొక్క యభినయనైపుణ్యమును, మీరాడుపలుకులయొక్క భావ మిట్టిదని స్పష్టీకరించుటకు నటునిటు సంచలించెడి మీవిశాలనేత్రముల యొక్క విలాసమును, మీరు మాట్లాడునపు డందలియర్థమును గోచరింపజేయుటకుగాను వింతవింతగ మారుచున్న మీకోమల వదనారవిందవికాసమును, ఒక్కొక్కప్పుడు మీరు సంభాషణధోరణిలో గొంతయుద్వేగమును జూపునపుడు మీ ముఖమండలిని గప్పు నుంకించుచు నటునిటు నెగరుచుండెడి మీముంగురులయొక్క సొంపును, వీనినన్నిటిని యప్పుడు నాయొక్కదృష్టి పాశ మీడ్చికొని వచ్చి నాహృదయకుహరమునందు భద్రముగ బంధించివైచినవి. మీవిగ్రహము

నాహృదయకుహూరమునందు బందీ యాయెను. ఇప్పు డేమనె
దరు ? విడిచిపెట్టెదురా ? అట్లయినచో సంధిని గావించు
కొనుడు.

ఇట్లు
శకుంతల

ఈలేఖను చూచుకొని, యాయువకు డెంతయో పట్ట
రాని యానంద మంది, పారవశ్యముచే, మైమఱచి, పిదప యీ
క్రిందివిధముగ బ్రత్యుత్తర మొసంగుచున్నాడు:—

మనోహారిణీ, బెజవాడ 27.1.26

మీరు వ్రాసిన లేఖను సాంగోపాంగముగ దిలకించి
యందలివిషయముల నన్నిటిని బాగుగ నవగాహన మొనర్చు
కొంటిని. తమకోమలములైన అంగుళీ లిలేఖను వ్రాయుటచే
నెంత నొచ్చినవో యని చాల విచారపడుచుంటిని గాని, లలిత
పదలాలిత్యసంపద దొలుకాడజేయుచు గంభీరభావగర్భితమై
యుండు మీ లేఖకుమాత్రము నే నెంతయు చెప్పరాని యానంద
మొందితిని. కాని మీ లేఖ నన్ను జేరి రెండుదినములైనను
నాప్రత్యుత్తరము మిమ్ము వెంటనే జేరజాలనందులకు నన్ను
క్షమింతురని నేను నమ్ముచున్నాను. తమయొక్క యమూల్య
మగు క్షమార్పణకు మున్ముందు నేను తగినవాడనని నిరూ
పించుకొనుటకు గొన్నిసహేతుకములగు సాక్ష్యములను మీ
యెదుట నుంచుచున్నాను.

ఇప్పటికి రెండుదినములక్రితమే మీా లేఖ చేరినది. కాని యట్టిలేఖకు ప్రత్యుత్తర మేవిధముగ నివ్వగలనా, యను ప్రబల సందేహము నాయెడదలో జనించి నన్నూఱక నారాటపెట్టసాగెను. గంటకు పదికాగితముల చొప్పున వ్రాసి తిరిగి యవి సరిగా లేవని నిస్పృహ జెంది చించి పారవైచెడివాడను. ఇట్లు నేను సమాధాన మేవిధముగ నిచ్చుటయా, యని సతమతపడుచు నిన్నసాయంకాలము సూర్యాస్తమయసమయమపుడు చల్లగాలికి యొకకొలనుదగ్గరకు షికారు పోయి యచ్చట కొంతసేపు కూర్చుండి, యాకొలనులో నున్న పద్మములవంక నాదృష్టిని సారించి తదేకదృష్టితో జూడసాగితిని. అప్పుడచ్చట నొకానొక వింతదృశ్యము నాకు గోచరించి ధైర్యము బురిగొల్పెను. అదెద్దియన: అప్పుడే, సూర్యుడు గ్రుంకబోవుచున్నాడు. పద్మలుగూడ కొంచెము కొంచెముగా ముకుళింప నారంభించినవి. అది తెలియక పాప మింతలో నొకతుమ్మెద రివ్వురివ్వున వచ్చి యొకపుష్పమునందు వ్రాలి, దానిలో నున్న మధువు నానుచుండెను. ఇంతలో సూర్యు డపరాద్రిని గ్రుంకిపోయెను. పద్మము పూర్తిగ ముకుళిత మయ్యెను. తుమ్మెద యందులో బంధింపబడియెను. అప్పుడాదృశ్యమును తలంచుకొనుచు నింటికి వచ్చి, యారాత్రియంతయు పడకపైన బరుండి యావృత్తాంతమునే మాటిమాటికి తలంచుచుంటిని. పిమ్మట కొంత సేపటికి తెల్లవారెను. వెంటనే నేను కాలోచితకృత్యములను దీర్చుకొనుటకై యాకొలనుదరిని గూర్చుంటిని. ఇంతలో

సూర్యోదయ మాయెను. వెంటనే యాకాసారములో నున్న యాపద్మము తనప్రియునియొక్క యాగమనమును జూచి ముఖ మింత జేసికొని ప్రఫుల్ల మయ్యెను. వెంటనే రాత్రి యంతయు బంధింపబడియున్న యాతుమ్మెద రివ్వున పైకెగచి పారిపోయెను.

ఈదృశ్యమును గాంచినంతనే నాకపరిమితసంతోష ముదయించి, బిరబిర యింటికి వచ్చి, యీనాప్రత్యుత్తరమును వ్రాసితిని. కావున యికమీాదనుండి నేను మీాకు ప్రియసఖుడ నాయెదను. నాయొక్క స్నేహవాత్సల్యమును దెల్పుకొనుటకు కొలదిదినములలోనే మిమ్ముల సందర్శించుట కాతురపడుచు న్నవాడను.

ఇట్లు
భవత్ప్రియసఖుడు
శ్యామలరావు

ఈవిధముగ నాయువతీయువకు లిరువురు నొకరి కొకరు తమతమ రచనానైపుణ్యమును నెఱపుకొని పిమ్మట వివాహ ములు గావించుకొనెడివారు. ఇయ్యది కొంతవఱకు ప్రాచీ నమైన పద్ధతి. ఈవిధముగనే యింకను గొన్ని ప్రేమలేఖలతీరు నీక్రింద నుదాహరణపూర్వకముగ నుదహరించుచున్నాము:—

· వివాహితులగు భార్యాభర్తలిరువు రొకరినుండి రొు కరు దూరముగ నుండునపుడును, లేక పొలయలుకలు వహించి

వీడియుండునపుడును నీక్రిందివిధము ననుసరించి తమతమ నైపుణ్యము మెఱయ లేఖలను వ్రాసికొని తద్ద్వారా యొకరిపై నొకరికి గల గాఢానురాగములను దెల్పుకొనుచుండు వారు.

ఒకభార్య, దూరదేశమునకు బోయిన తనభర్త కీక్రింది విధముగ వ్రాయుచున్నది:—

ప్రాణనాథా, రాజమండ్రిది 15-6-28

భవత్పదదాసి తమ్మును వినయపూర్వకముగ ప్రార్థించుచు గావించుకొను దీనాలాపములు.

తాము గృహము వీడి యేగినది మొద లింతవఱకు తమకడనుండి తమయోగక్షేమములను దెలుపు నొక్కలేఖ యైనను రాకుండుట జూడ నాకెంతయో విషాదాశ్చర్యములను గొల్పుచున్నది. అదేలొకోగాని నాకు రెండుమూడుదినములనుండియు దక్షిణనేత్ర మొకటేతీరున యదరజొచ్చెను. కారణ మేమియు దెలియకున్నది. తలచుకొనినకొలది భయ మెక్కుడగుచున్నది. నాప్రతిదినమును, నాప్రాణసర్వస్వమును, నాప్రేమైకమూర్తియును, మన్మనోనాథులును, నన్ను బోషింప రక్షింప భర్తలు కర్తలు నగు మిమ్ములను, సదా రక్షించుగాత మనియును, త్వరలో మిమ్ములను సురక్షితముగ నిల్లు జేర్పవలసినదనియును ననేకవిధములుగ భగవంతుని ప్రార్థించుచు, మీరిచ్చుటికి వచ్చినచో మన ముభయులము జేరి భగవంతునికి కానుక లర్పింతుమనియు మ్రొక్కుకొంటిని. మఱి

యు మీతో జెప్పుటకు సిగ్గగుచున్నది. చెప్పినచో మీరు నన్నన్యథా తలంచి కోపపడియెదరేమో యని భయ మగుచున్నది. అయినను నేను మీయెడ నిదివఱ కేవిషయమును దాచినదానను గానుగనుకను, మీయొక్క హృదయమునందు నాకెట్టితావు గలదో నాకు బాగుగ దెలియునుగనుకను, మీయొక్క క్షమార్పణబుద్ధి—అబ్బా, ఆనాడు....ఆహా! ఎంతటి ప్రశాంతమూర్తులు! ఎంతటియుదార గంభీరసుదృఢచిత్తులు! అవియన్నియు నాస్మృతిపథమందు దాండవించుచున్నవి. తలచుకొనినంతమాత్రముననే నాగుండె నీరగుచున్నది. నారెక్క లెగురుటకు సంసిద్ధము లగుచున్నవి! నాయక్షులు మీదివ్యమంగళ విగ్రహసందర్శనోత్సుకత నూఱక జలము లూరజేయుచున్నవి. ఇవియన్నియు నాకు దెలిసినవియే గనుకను, అట్టి మీయందు నాకు గల చనవుచే నేనీరహస్యమును బయటపెట్టుచుంటిని గాన కోపపడకుడు. లజ్జావిహీనని తలంపకుడు. నేను నిన్నటిరేయిని మనచంటికుర్రవానిని ప్రక్కనే పరుండబెట్టుకొని, మిమ్ములను దలంచుకొనుచు నొక్కొక్కప్పుడు మనమిద్దరమును కష్టకాలములో సంసారచక్రమును అతిగుప్తముగ నెట్లు గడిపినదియు మన కొండొరులపై నుండు ప్రేమానురాగములగుఱించియు సంభావించుకొనుచు సంతోషవిచారములతో గూడిన డెందముతో గన్ను గొంచెము మూఁతగిత్తిని. అంతలో నొకవ్యక్తి యాపాదమస్తకము నల్లని బురఖాను ధరించి, యాతనిస్వరూపమే కనబడకుండ, మెల్లగ

నాచెంత కరుగుదెంచి, ప్రక్కనే కూర్చుండి, మెల్లగ దన మెడను వాంచి, నా —చెప్పుటకు సిగ్గు అగుచున్నది. అయి చెప్పవలెనని నాకెంతయో యారాట ముదయించెనుగాన చెప్పుచుంటిని; కోపపడకుడు—నాచెక్కిలిని ముద్దుగొనెను. అంతలో నాకు మెలకువ వచ్చి, కనులు విప్పి చూచితిని తొలుత దయ్యమో భూతమో యని కొంతవఱకు భీతిల్లితిని. పిదప నట్లాతడు నన్ను ముద్దిడుకొనినందులకు కోపవిషాదములు రేకెత్త పండ్లు పటపట గొఱుకుచు కన్నులనుండి నిప్పులు రాల్చుచు, యెక్కుయదటున నాతనిని మెడ పట్టి క్రిందికి పడ ద్రోసి—అప్పుడెట్లు వచ్చెనో నాకాశక్తి నాకు తెలియదు— చెందున నేలపై కుటికి, రోషభీషణ వాక్కులతో గర్జించుచు "ఓరీ నీవెవడవు ? ఈనిశీథసమయమున నీ విచ్చటి కేల వచ్చితివి ?" అని యడిగితిని. అందుల కాతడు బిగ్గరగ నవ్వు చు ప్రత్యుత్తర మేమియు నొసంగకయే మెల్లగ లేచి నావం కకె వచ్చుచుండెను. అప్పటినాస్థితి యమోమయముగ నుం డెను. కోపమునకు మితి లేదు. భయమునకు మేర లేదు. దుఃఖ మునకు నంతు లేదు. కొంతసే పట్లే భ్రమానపడియుంటిని. అత డంతకంతకు నన్ను దరియుచుండెను. అప్పుడు నాజన్మలో నేను చేయలే నటువంటి సాహసకార్యము తలంపునకు వచ్చెను. వెంటనే యానమీపమునం దున్న మీచేతికఱ్ఱ నెత్తితిని. అతడు ఆఁ, ఆఁ, అనుచు నేమో చెప్పుచుండెనుగాని నేనావేశ ముతో నామాట లేమియు వినకయే యతనితలపై నాబలము

కొద్ది నాకఱ్ఱను విసరికొట్టితిని. అది యాతనికి తగిలి నేలపై బడిపోయెను. అప్పుడు నాకు గలిగిన భయ మింత యంత యని చెప్పుటకు నలవి కాదు. నాశరీరమంతయు గడగడ వడకు చుండెను. కాళ్లు ముందుకును రావు; వెనుకకును పోవు. అట్లే నిలుచుండి కొంతసేపటికి నాకు పిచ్చిపట్టినదానివలె నాతని వంకనే చూచుచుంటిని. అటుతర్వాత మెల్లగాబోయి దీపమును పట్టుకొని వచ్చి, వడవడ వడకుచు మెల్లగ నాపడియున్నవాని ముఖముపై నున్న గుడ్డను తొలగించి, దీపపువెలుతురున జూచి కట్టెయై పోయి యట్లే యుండిపోతిని. అయ్యది మీారే! ఆదెబ్బ తిన్నది మీాముఖారవిందమే! శిరస్సుపై బలమైన గాయము తగిలినది! రక్తము. స్రవించుచున్నది! ఆరక్తము నాకంట బడియెను. కన్నులు వానియంతట యవియే మూత లు వడియెను. తల గిర్రున చుట్టుచుండెను. చేతిలో నున్న దీపము జారి పడిపోయెను. నేను మీాపైన వ్రాలిపోయితిని. ఇంతలో మెలకువ వచ్చి కన్నులు విప్పిచూడగా మంచము క్రింద బోర్లగిలపడియుంటిని. మోచేతులు మోకాళ్లు కొట్టు కొనిపోయెను. అప్పుడు నాలో నేనే నవ్వుకొని మెల్లగా లేచి మంచముపైన గూర్చుంటిని. మనచంటిపిల్లవాడు నోటిలో వ్రేలుపెట్టికొని నిదురించుచుండెను. అప్పు డాతనిచెక్కిలిని గట్టిగ ముద్దిడికొంటిని. ఇంతలో పిల్లవాడు లేచి పాల కేడ్వసాగెను. అప్పు డాతనిప్రక్కనే పరుండి వానికి స్తన్య మిచ్చుచు నేను గాంచిన వింతస్వప్నమును గుఱించి తలంచుకొనుచు, మిమ్ము

లనుగుఱించి యనేకవిధముల సంభావించుకొని నిద్రబోయి
తిని. ఇది నాస్వప్నవృత్తాంతము. పిల్లవాడుకూడ "నాన్న,
నాన్న"యని వాపోవదొడంగెను. కావున యీలేఖ మీ
కందినవెంటనే ప్రత్యుత్తరము వ్రాయుచు, మీరెప్పుడు వచ్చు
నదియు, మీయోగక్షేమములగుఱించియు దెలుపవలయును.

మీలేఖకొఱకెదురు చూచు

భవత్పదదాసి

శ్యామల

ఇట్టు లతినైపుణ్యముతో వ్రాయబడిన లేఖను గాంచి
నంతనే చూపె భర్త తనభార్య యింతటి నైపుణ్యముతో
వ్రాయగలిగినదా, యని యెంతయు నబ్బురమును సంతోష
మును గలిగి, యాలేఖను ఐదారుమారు లూరక చదివి తనలో
దాను మురిసిపోవుచు, నిట్టిభార్యను భగవంతుడు తనకు ప్రసా
దించినందుల కెంతయు నాతనికి తనకృతజ్ఞత ననేకవిధములుగ
దెలుపుచు, నిట్టిసహధర్మచారిణిని గలిగినందులకు దానెంతయు
గర్వపడుచు, నెప్పు డెప్పుడు గృహమునకు మరలుదమా యని
తహతహపడుచు నీక్రిందివిధముగ నతిచమత్కారముగ బ్రత్యు
త్తర మొసంగెను:—

నాప్రాణధనమా, విశాఖపట్టణం 22-6-23

నీవెట్లో యత్యంతముగ కష్టపడి వ్రాసిన లేఖను
గాంచితిని. నీవీలేఖను వ్రాయుట కెన్నిరోజులు కష్టపడితివో

నాకు దురూహ్యముగ నున్నది. కొన్నిదినములవఱకు గృహ
కృత్యముల నన్నిటిని కొంతవఱకు గట్టిపెట్టి యీ లేఖను వ్రాసి
యుందువని నేను తలచెదను. నీ వింతస్వప్నవృత్తాంతమును చది
వితిని. నీవా స్వప్నమున గొట్టిన దెబ్బ నాకు తలమీద దగిలి
నది నిజమే. ఇప్పటికి 20రోజుల క్రితము రైలులోనుండి దిగు
చుండగా, వెనుక గుంపు నెట్టుకొని వచ్చుటచే నాతల తలుపు
నకు దాకి పెద్దగాయ మాయెను. ఆరోజు కారోజు చీముపట్టి
గాయము చాల బాధపెట్టెను. ఇప్పుడు చాలవఱకు నెమ్మదిగ
నున్నది. నీవు స్వప్నములో నన్ను గొట్టిన దెబ్బకు నిన్నెట్లు
క్షమియింపగలనో నాకే తెలియకున్నది. అట్టిదెబ్బకు నీకు
తగిన శిక్ష యొసంగవలెనని నేనూరక తహతహలాడుచున్నాను.
కొలదిరోజులలోనే యచ్చటికి వచ్చి నీకు తగినశిక్ష నొసంగె
దను. మనపిల్లవాని యారోగ్యమునంగతిగాని, నీయొక్క యోగ
క్షేమములుగాని లేఖలో దెలుపకుండుట యది యొక తప్పి
దము. ఈతప్పిదమునకుగూడ నీవు శిక్షకు నర్హురాలవు. ఇన్ని
తప్పిదములు చేసిన నిన్ను క్షమింపగలనా? త్వరలోనే రాగల
వాడను. ఇకమీద యిట్టి వినుగుపుట్టించు కొండవీటి చేంతాడుల
వంటి లేఖలను వ్రాయుటలో గాలము వృథాబుచ్చక,
గృహకృత్యములం దతిజాగరూకత గలిగి, చంటికుఱ్ఱవాని
యోగక్షేమములను దెలుపుచు నొకలేఖను వెంటనే వ్రాయు
దువని తలంచెదను. అన్యథా భావింపకుము.

ఇట్లు
భవత్ప్రియుడు
సుందరరావు

ఒకకలహాంతరితనాయిక యగు నొకయువతి తనభర్త కిటుల వ్రాయుచున్నది :—

ఓకలహప్రియా, మచిలీపట్టణం, ది 14-11-28.

మీరా రానాడు కావలయునని యెట్లో సేతో బోరాడి యిలు వెడలిపోయిరికదా! ఇంతవఱకు నింటికి రాకుండుటకు గతమేమి? విరగడై పోయినదికదా పీడ యింతటితో నని యచ్చటచ్చట విలాసముతో సంతోషముతో గాలము బుచ్చుచుంటిరికాబోలు. పాపము; మీరు తలంచుకొన్నట్లుగ నెఱవేఱక మరల యీపీడయే మిమ్ములను తిరిగి పట్టుకొనుచున్నదని యీ లేఖను జూచి బెదరిపోయెదరుకాబోలును. ఇందులకు నేనేమి చేయుదు? ఇందులకు మనయిద్దఱిది తప్పు కాదు. మనల నిద్దఱిని యొకటిగా జేర్చిన యా బ్రహ్మదేవుని యొక్కయు మనయిరువురిని యగ్నిహోత్రములముందట ప్రమాణముల దీసికొనుడని నిర్బంధించి, వివాహకాలమునం దైదవనాటి రాత్రి యిరువురికొంగులను ముడివైచి, యరుంధతీదేవి సందర్శనము గావింపనిచ్చిన వారలగు మనయిరువుర తల్లిదండ్రులయొక్కయు, బంధువర్గముయొక్కయు, పురోహితుల యొక్కయు తప్పిదమని నావినిశ్చితాభిప్రాయము. పోనీ, యప్పటికి మీకు నాకంటె కొంతవయస్సు అధికముగదా! అప్పటికి నేను చిన్నదాననేగదా! అప్పుడే "యీపిల్లను నేను వివాహమాడ" నని యేల చెప్పజాలకపోయితిరి? కావున యిప్పుడు మీరు చేసే

తుల జేసికొన్నదానికి యనుభవించియే తీరవలయునుగాని మఱి గత్యంతరము లేదు. నావలన మీ కనేకకష్టములు కలుగు చున్న వనుట నిజమే. అయినను నేను బ్రతికియున్నంతవఱకు మీ రెట్లో యోర్చుకొనవలసియుండును. లేకున్నచో నన్నొక సారి చంపివేయుడు. నేను దానికి సంసిద్ధముగ నున్నాను. కాని నేనొక్కమాటమాత్ర మడిగెదను. నేనెప్పుడైనను మిమ్ము లను నగలకుగాని, చీరెలకుగాని లేక యేయితరవస్తువులకు గాని కష్టపెట్టితినా? మీరు నాకేవిషయమునందును కొఱత చేయుటలేదని మాత్రము నాకు బాగుగ దెలియును. నేను కాపురమునకు వచ్చినదిమొదలు ఏకొఱంతయు లేకుండ నన్ను మీరు కంటికి ఱెప్పవలె గాపాడుచుండుట నాయంత రాత్మకును పరమాత్మునకు దెలియును. కావున యీదీనురాలి యందు దయయుంచి యీలేఖ యందినవెంటనే తమ యమూల్యమైన ప్రత్యుత్తర మొసంగెదరుగాక! ఇంతటి దీర్ఘమై నట్టియు, నసహ్యకరమైనట్టియు లేఖను వ్రాసి, మిమ్ములను కష్ట పెట్టినందులకు క్షమింపవేడుచున్నాను.

ఇట్లు

తమకలహకారిణి

క మ ల

దీనికి యాపెభర్త యతిచమత్కారముగ నీక్రిందివిధముగ బ్రత్యుత్తర మొసంగెను.

కలహకారిణీ, మదరాసు, 21-11-28

నీయుపదేశపూర్వకమగు లేఖ నాకు జేరినది. నాభార్య యిట్టియుపదేశముల నొసంగుటయందు గడు చాకచక్యము గలదని తెలిసికొనుట కెంతయు గర్వించుచున్నాను. కాని నేను నీచెంత నుండిన నీకెంతకష్టముగ నుండునో యని విచారపడి యిచ్చటికి వచ్చితిని. కాని నీవు నన్ను మఱిపోకుండ నీలేఖను వ్రాసినందుల కెంతయు సంతసించుచున్నాను. నీవలన నాకు గూడ యెట్టికష్టములును సంప్రాప్తము కాలేదు. ఎట్టికష్టములైనను ఓర్చి నాతో సంసారజీవనము గడుపుచున్నందులకు నేనెంతయు సంతసించుచున్నాడ. అట్లే యికమీదగూడ నాయందు లోపము లున్నయెడల నన్ను మన్నించి నన్ను కృతార్థుని జేయుదువుగాక యని నమ్ముచు నీలేఖ నింతటితో ముగించుచున్నాను. నేను కొలదిరోజులలోనే యిచ్చటికార్యములను జక్కబెట్టుకొని వత్తును. నీయొక్క యోగక్షేమములను దఱుచు తెలుపుచుండవలయును.

ఇట్లు

భవత్కలహప్రియుడు

మురహరిరావు

ఒక వేశ్య, తనకపటప్రేమనంతటిని జూపుచు, తనవిటుని మనస్సు కరగునట్లుగ నతిచమత్కారముగ నీక్రిందివిధముగ నొకవింతలేఖను వ్రాయుచున్నది:—

నామనస్సుంమనోహరుని దివ్యపాదారవిందములకు నమస్కరించి భవత్పదదాసి చేయు దీనాలాపములు:—

ప్రియా, గుంటూరు, 15-12-28.

నాగృహము తాము వీడినదిమొదలు నాకోర్కలతీవియ ప్రుగ్గిపోయెను. ప్రతిదినమును చెప్పరాని యావేదనపడుచుంటిని. దినవెచ్చమును చెల్లింపలేక నాతల్లివలన ప్రతిదినమును తిట్లు తినవలసివచ్చెను. కావున మీరు తప్పకవిచ్చేయవలయును. నాకోర్కను చెల్లింపవలయును.

ఇట్లు
భవన్మనోహారిణి
మోహనాంగి

ఈజాబుయొక్క ప్రథమాక్షరమును నంత్యాక్షరమును సమన్వయించి చదువుకొనవలయును.

ఈపై లేఖ లన్నింటిని యుదాహరణమునకై వ్రాసితిమి. ఇప్పుడు చాలమంది నవనాగరకులగు యువతీయువకులు తమ యుత్తరప్రత్యుత్తరములందు కృత్రిమప్రేమంపు సందేశము

లనే యంపుకొనుచున్నారు. కాని యీప్రేమసందేశములను లేఖలద్వారా నంపుకొనుట తప్పని మేమనజాలము గాని యీ లేఖలు కృత్రిమప్రేమను వెలిబుచ్చునట్టివిగాక, యాదర్శ ప్రాయమైనట్టియు, నిక్కువమైనట్టియు ప్రేమనే వెలిబుచ్చున ట్టివిగ నుండవలయునని మాయాశయము. కావున మాపాఠకు లీగ్రంథమునందలి యంశముల నన్నింటిని చక్కగా బఠించి యిందు గల మంచిని గ్రహించి యింకను మమ్ముల నిట్టిగ్రం థముల వ్రాయుటకు బ్రోత్సహించెదరుగాక యని ప్రార్థిం చుచు నింతటితో నీగ్రంథరచనకు స్వస్తి చెప్పుచున్నాము.

సంపూర్ణము

# స్త్రీ పురుష ప్రేమ రహస్యములు

ఇందు స్త్రీపురుష జాతులును, ఏయేజాతిపురుషు డేయేజాతి స్త్రీకి దగుననియును, స్త్రీని పురుషు డెటుల వశపఱచుకొనవలసినదియు, ప్రేమ ప్రవాహ విచిత్రగమనము, వ్యభిచార దోషము, అనుకూల దాంపత్యము, సాంసారికజీవనము, శయ్యామందిరమర్మములు, సతీపతులసరససల్లాపములు, యౌవనోద్వేగము, పుంసత్వగ్రహణము, శుక్లస్తంభము, అపరిమితసంయోగాభిలాష వలని దోషములు, గర్భధారణము, సంతాన నిరోధము మొదలయినయంశము లీగ్రంథమునందు సవిస్తరముగ విశదీకరింపబడెను ఇయ్యది ప్రతి స్త్రీపురుషాదులచే పఠింపబడవలయును. మఱియు దీనియందు 8 చిత్రపటము లల్లారు ముద్దుగా సందర్భానుసారముగ పొందుపఱుపబడినవి. వెల రూ. 1 0 0

## మదన కలాశాస్త్రము అను

# శరీర మర్మ శాస్త్రము

ఆంధ్రభాషయందింత పూర్ణమైన రహస్యశాస్త్రము ఇంతవఱకు ఎవరి వలనను బహిరంగముగ ప్రచురింపబడలేదు. ఇందులో స్త్రీపురుష లక్షణములు, వారియొక్క సరియైన యుపయోగమును, మొగ, శిశూత్పత్తి విధమును, రతీమన్మథరహస్యములు, వివాహము, ప్రేమ, స్త్రీ పురుషుల సంసారసుఖములు బహు చక్కగా వ్రాయబడినవి. తప్పక సందరు చదివి తీరవలెను. 64 చిత్రపటములు వేయబడినవి. వెల రూ. 1 0 0

# గర్భ శాస్త్రము



ఋతుసంబంధమైన విషయములు, గర్భమనగా నేమి?, గర్భమెట్లు కలుగలుగుచున్నది?, పిండోత్పత్తి క్రమము, ప్రసవకాలనిర్ణయము, సుఖప్రసవ మార్గములు, సత్సంతాన మును బడయవలసిన మార్గములు, మంత్రసాని తెలిసికొనవలసిన ముఖ్యవిషయములు, బాలింత లవలంబింపవలసిన విధులు, తల్లులు పిల్లలకు పాలివ్వవలసినరీతి, శిశుపోషణా విధానము మున్నగు ముఖ్యవిషయము లెన్నియో గలవు. వెల రూ. 1 0 0

